# అప్పటి ముచ్చట్లు

(కథల సంపుటము)

ఉభయభాషాప్రవీణ, సాహిత్యవిద్యాప్రవీణ

బులుసు వేంకట రమణయ్య, పి. ఓ. ఎల్.

ప్రధానాంధ్రోపాధ్యాయుఁడు, కెల్లెట్ హైస్కూలు, మద్రాసు.

ఆర్. వేంకటేశ్వర్ అండ్ కో

ఆనంద ముద్రణాలయము

మద్రాసు

1949

థలు కూర్పఁబడి

ములు వాడఁబడినవి;

# ముందుమాట

ఇతర వాఙ్మయములందువలెనే తెలుఁగు వాఙ్మయమునఁ గూడ ఇపుడు కథలు మంచి స్థానము నాక్రమించుకొన్నవి. ఏ విషయమును సులభముగ తలకెక్కింపఁదలఁచినను కథయే పరమ సాధనమని ఎల్లరకును ఎఱుక. వీని ప్రాధాన్యమును గమనించియే మన ప్రాచీనులు గద్యరూపమునను, పద్యరూపమునను పెక్కు కథలను రచించియున్నారు.

"అప్పటి ముచ్చటలు" అను నీ సంపుటిలో పదునొకండు కథలు - సంస్కృతగ్రంథములనుండియు, తెలుఁగుప్రబంధములనుండియు గ్రహించి కూర్చఁబడినవి. రెండు కథలకు పెద్దలవలని వినికిడి యాధారము. ఆ యా గ్రంథములలోని కథల సారము మాత్రము ఇందు గృహీతము; కొన్ని యెడల మార్పులుకూడ చేయఁబడినవి. ప్రతికథకును చివఱ కథనుండి తెలియఁదగు నీతి-ముఖ్యమని తోఁచినది తెలుపఁబడినది. దానితోఁబాటు పాఠకులు మఱికొన్ని నీతులను ఆ యా కథలనుండి గ్రహింపవచ్చును.

ఇంటిలో పనిపాటలు లేని సమయమున మహిళామణులును, వినోదముగఁ గాలము గడపఁదలఁచునపుడు బాల బాలికలును చదువుకొనుటకు అనువగు శైలిలో ఈ కథలు కూర్పఁబడినవి. వారి సౌకర్యముకొఱకు చిన్న చిన్న పదములు వాడఁబడినవి;

ఎడనెడ సంధులు విడువఁబడినవి. కొంతవఱకును శ్రమించి జనసామాన్యమునకు ఎఱుకలో లేని కథలే మూఁడువంతులీ "ముచ్చట"లలోఁ గూర్పఁబడినవి.

భారతీయుల దృష్టి యిపుడు దేశభాషలపై ప్రసరించ
అది భాష చేసికొన్న అదృష్టము! విద్యాశాఖాధికారులును దేశ భాషలపయి ఎక్కువ ఆదరము చూపుచున్నారు. ఆ యధికారులును, ఆంధ్రలోకమును ఈ కథల తీరును గమనించి తగిన ప్రోత్సాహము నొసంగినచో గ్రంథకర్తయొక్కయు, ప్రకాశకుల యొక్కయు ప్రయత్నము సార్థకము కాఁగలదు.

వ్యయ, ఉత్థానైకాదశి
చెన్నపురి

బులుసు వేంకటరమణయ్య

# అనుక్రమణిక



# అప్పటి ముచ్చటలు

## అయుతుఁడు

పూర్వము సంయమిప్రవరుఁడగు ప్రయుతుని కిరువురు కుమారులు అయుత, నియుతు లనువా రుండిరి. వారు అగస్త్యమహాముని కంతేవాసులయి సమస్తవిద్యల నభ్యసించుచుండిరి. వారి శుశ్రూషకును, సత్ప్రవర్తనమునకును, వినయవిధేయతలకును కుంభసంభవుఁడు మిగుల సంతసించి, కోరిన విద్యల నన్నింటిని నేర్పెను. విద్యాపరిపూర్తియైనపిదప ఆ మహాముని యిట్లాలోచించెను:—
"ఈ నా శిష్యులు మంచి బట్టలు లేవని విచారింపరు; ఆఁకలి దప్పుల కటమటింపరు; తలలు మాసినవని తల్లడిలరు; మేను లెంత బడలినను ఆ బడలికను పాటింపరు; రాత్రింబవ ళ్లిడ తెగక అధ్యయనము చేయుచున్నను, కూరుచుండిన చోటినుండి కొంచెమైనను చలింపరు. నా శిష్యకోటిలో వీ రిరువురే విజ్ఞాననిధులు. వీరి గురుభక్తి వర్ణనాతీతము. కావున నే నిపుడు వీరికిఁ దగిన కన్యలను వెదకి తెచ్చి, పెండ్లిచేసి యొక యింటివారి నొనరించుట మేలు."

అగస్త్యుఁ డిట్లు తలఁచి తిన్నగా సత్యలోకమునకుఁ బోయి, అచట బ్రహ్మపుత్రికలును, మిగుల అందకత్తెలును అగు గాయత్రి, సావిత్రి యనువారిని గాంచి, వారు తన శిష్యులకుఁ దగిన వధువులని నిశ్చయించి, తన కోరికను బ్రహ్మకుఁ దెలిపెను. అతఁడును మిగుల సంతసించి అగస్త్యుని వెంట నా కన్నియలను భూలోకమునకుఁ బంపెను. అగస్త్యుఁ డిట్లు గంపెఁ డాసతో కన్నియలను దీసి

కొని రాఁగా, నియుతుఁడు పెండ్లి చేసికొనుట కంగీకరించెను; కాని యగ్రజుఁడగు అయుతుఁడు సంసారజంబాలమునఁ బడనొల్లక తన గురు వెంత బతిమాలినను వినక తాను గృహస్థాశ్రమమును స్వీకరించుట కంగీకరింపఁడయ్యెను. అగస్త్యుఁ డందులకు మిగులఁ గోపించి అయుతునిఁ దన యాశ్రమమునుండి వెడలఁగొట్టి, యా యిరువురు కన్యలను నియుతునకే యిచ్చి పెండ్లి గావించెను.

నిర్దయుఁడయి గురువు తన్ను తరిమివేయుటకు అయుతుఁడు మిక్కిలి బాధపడియుఁ దన యభిప్రాయమును మార్చుకొనక, బ్రహ్మచర్యనిష్ఠఁ బూని, తీవ్రముగఁ దపం బొనర్చుచుండెను. అయుతుని యీ ప్రవర్తనమునకు మిగులఁ గోపించి యింద్రుఁ డెట్లయినను అతని నియమమును పాడుచేయఁదలఁచి, యొక ముదుసలి వానప్రస్థుని వేషమున అయుతుఁ డున్న వనమునకు వచ్చెను. అపుడు చినిఁగిపోయిన జింకతోలుతోఁ గట్టిగాఁ గట్టిన తాటియాకుల పుస్తకముల నొక శిష్యుఁడు మోసికొని యాతని వెంట వచ్చెను. కంబళి, కావిగుడ్డలు, దర్భాసనములు, కమండలువు మున్నగువానిని వేఱొక యంతేవాసి మోసికొనివచ్చెను. పప్పు, బియ్యము, సత్తుపిండి, ఉప్పు, చింతపండు మున్నగు సంభారముల నింకొకఁడు తెచ్చెను. స్రుక్కు, స్రువము, దర్భలు, నేతితో నిండిన వెదురుగొట్టము మున్నగు యాగోపకరణములను మఱి యొక ఛాత్రుఁడు పట్టుకొని వచ్చెను. నడచుటకుఁ గూడ శక్తి లేక యీడిగిలఁబడుచున్న ఒక ముసలియావు మెడకు దామెనత్రాటిని బిగించి లాగుచు, మిక్కిలి శ్రమతో దానిని దూడతోఁగూడ నడిపించుకొనుచు నొక చిన్న వడుగు వచ్చెను. ముగ్గుబుట్టవంటి నరసిన తలతో నొక ముదుసలి యవ్వ—ఆ వానప్రస్థునిగృహిణి—ఆ వెనుక కఱ్ఱపట్టుకొని వంగి నడచుచు వచ్చెను. ఇట్టి సంసారముతో బయలుదేఱి కపటయోగి యగు నింద్రుఁడు అయుతు

నాశ్రమమును ప్రవేశించి, మాధ్యాహ్నికక్రియలను, భోజనమును నిర్వర్తించి, ఎండ చల్లఁబడినపిదప, అయుతుం జేరి, యతని కుల గోత్రములను, తపశ్చర్యను దెలిసికొని, యిట్లు పలికెను:—
"నాయనా! నీ తండ్రి ప్రయుతుఁడు నాకు మిత్రుఁడు. నీ వతని జ్యేష్ఠపుత్రుఁడవని వినుట కెంతయు నానందముగ నున్నది. కాని నీవు నీ పెద్దల యాచారము నతిక్రమించి, గురువునకుఁ గోపము పుట్టించి, బంధుమిత్రులను విడిచి, గృహస్థాశ్రమము నొల్లక శాశ్వతబ్రహ్మచర్యమును బూని, ఘోరతపం బొనరించుట పాడి గాదు. పరాశరుఁడు మున్నగు మహామహులే ఇంద్రియములను జయింపజాలకపోయిరి. నీ వనఁగా లెక్క యేమి? తలలు బోడి చేసికొన్నంతమాత్రమున మోక్షము లభించునా? ముక్తి సంసారమువలననే గలుగును. సంసారమే ముక్తి యనియుఁ జెప్ప వచ్చును. పొలమునుండి కావలసిన పంటలును, గోశాలనుండి కావలసినంత పాడియు వచ్చుచుండఁగా, ఇంటిలో అతిథు లెల్లపుడును తృప్తిపొందుచుండఁగా, ఎడనెడ వివాహములు, ఉపనయనములు జరుగుచుండఁగా, సేవకు లాజ్ఞానువర్తులయి ఉండఁగా, తానే యూరికిఁ బెద్దయయి, ప్రజలు తనపయినే నమ్మకకలిగియుండఁగా సుఖముగాఁ గాలము గడుపు గృహస్థే లోకమున ఉత్తముఁడు; అదృష్టవంతుఁడు. అట్టి గృహస్థధర్మమే ముక్తి. నీవు నీ తలఁపు మార్చుకొని గృహస్థాశ్రమమును స్వీకరించుటయే మేలని నాకుఁ దోఁచుచున్నది."

ఇంద్రుఁ డిట్లు బోధించినను అయుతుఁ డొప్పుకొనక గృహస్థాశ్రమములోని లోపముల నెన్నుచుండుటఁ జూచి యిక లాభము లేదనుకొని కోపము నటించి "గుడిని మ్రింగువానికి గుడిత్రలుపు లేమి లెక్క? మహాతపస్వియుఁ, దత్త్వవేత్తయు, నాచార్యుఁడును, మహామహిమాన్వితుఁడు నగు అగస్త్యమహామునియంతవానిని

తిరస్కరించిన నీవు నాబోటి సామాన్యుని లెక్కచేయకుండుట యేమి వింత ? ఏమో పసివాఁడవు గదా, వినకపోదువా ? అను భ్రాంతితోఁ బలికితిని; కాని నీ వెట్లుపోయిన నా కేమి? నీకర్మము నీది" అనుచు నతఁడు తనదారిని బోయెను.

మాయావియగు నింద్రుఁ డట్లు పలికెనేగాని, పాపము ! అయుతు నంతతో విడువలేదు. ఎట్లయినను అయుతుని నియమము నకు విఘ్నము కలిగింపవలెననియే యతని పట్టుదల. తన యాశ యము నెఱవేఱుటకయి ఆతఁడు ముసలియావురూపున నున్న తన కామధేనువును అచటనే విడిచి పోయెను.

ఇంద్రుఁడు విడిచిపెట్టిన యా ధేనువు పరుండిన పిదప లేచు టకు శక్తిలేక యుండెను. అది దర్భగడ్డిని కొఱుకునేగాని మ్రింగ లేకుండెను. దాని శరీరముపయిఁగల పుండ్లను కాకులు పొడుచు చుండఁగా కష్టముమీఁద తోఁకతో వానిని త్రోలుకొనుచుండెను. దాని దేహమున ఈఁగలు, దోమలు ముసురుకొనుచుండెను. దానిని చూచిన, ఎట్టి కఠినహృదయమైనను కరఁగును. ఆ యావు తన పర్ణశాలవైపునకు రాఁగా అయుతుఁ డవలోకించి, ఆశ్చర్యపడి, "ఏమీ ! ఇది మొన్న వచ్చిన మునిధేనువుగాఁ గన్పడుచున్నదే ! పాపము ! దీనికి ఎంతలో ఎంత గతి పట్టినది ! దీనిని రక్షింపక యుపే క్షించుట న్యాయము కాదు" అని తలఁచి దానికి సేవజేసి, కొలఁది దినములలో నా మొదవు ఎట్టి రోగము లేక నవనవలాడుచున్నట్లు తయారుచేసెను. దాని సంరక్షణకయి అయుతునకుఁ గొంత కాలము వృథా యగుచుండెను.

క్రమక్రమముగా నా ధేనువు బలిసి ప్రతివత్సరము ఈనుచు, ఆ యడవిలోని జంతువుల కన్నింటికిని భయము గొలుపుచుండెను. అప్పుడయుతుఁడు తన నియమచలనమునకు విచారించి, తన తప

స్సునకు విఘ్నరూపముయిన ఆ యావును బలవంతముగ నయినను ఆ యడవినుండి తఱిమివేయఁదలఁచి, కదలక వెనఁగులాడుచున్న యా గోవును చావఁగొట్టి మెడకుఁ ద్రాటిని గట్టి, యీడ్చుకొని పోవుచుండ ఆ మోసపుగోవు పరుగిడుచుఁబోయి, తనపయిఁ బుట్ట పెరుగునట్లు నిశ్చలుఁడై యుండి ఘోరమగు తపస్సు చేయుచున్న వాధూలమహాముని మట్టివైచెను.

సులభక్రోధుఁడగు నా మహర్షి త్రుళ్లిపడి లేచి, తన తపో విఘ్నమునకును, అవమతికిని కారణ మేమా? యని చూచుచుం డఁగా-ఆ మాయాగవియు, దాని వెంట నున్న అయుతుఁడును అతని కంటఁబడిరి. ఆ ముని కోపము పట్టఁజాలక అయుతుం జీరి "ఓరి దురాత్ముఁడా! ఎంత కావరమురా! కన్ను తెలియ లేదా! తపస్సు చేసికొను ముసలి మునితోడనా నీ పరిహాసము! ఈ నీ కృత్యమున కర్హముగ కప్ప వయ్యెదవుగాక!" అని యాతనిని శపించెను.

అయుతుఁడా సంయమీంద్రుని పాదములపైఁబడి కన్నీరు కార్చుచుఁ దన యావద్వృత్తాంతమును తెలిపి, అందుఁ దన తప్పు లేదనుటను వివరించి శాపము నుపసంహరింపవలెనని బతిమాలెను. అయుతుని వృత్తాంతమును విని, వాధూలుఁడు జాలిపడి "నాయనా! నీస్థితికి నాకుఁ జాల విచారము కల్గుచున్నది. ఎట్టివారికిని విధి దాటరానిది. కోపావేశమున నిన్ను శపించితిని. నా శాపమునకుఁ దిరుగులేదు. నీవు దర్దురమవయి పుట్టి, దర్దురాంగనయందు సంతా నము పొందినపిదప శాపవిముక్తి కాఁగలదు. నీవు గృహస్థాశ్రమ మును దిరస్కరించుటంజేసి యింతలు పుట్టె." అని శాపావసాన మునుగూడఁ దెలిపెను. అయుతుఁడును కప్పయయి పాండురంగ క్షేత్రమునందలి తీర్థములందు నివసించుచుండెను. సుకృతవిశేష మునఁ బూర్వజన్మజ్ఞాన ముండుటచే ఆ కప్ప సర్వదా హరిసేవ

యందే కాలము గడుపుచు, హరిదాస మనుపేరఁ బ్రసిద్ధికెక్కెను. మఱియు నది చిత్రవర్ణములుగల శరీరము కలదగుటచే అందము గల్గి, సర్వజనాకర్షకముగ నుండెను.

ఒకప్పుడు కాన్యకుబ్జదేశాధీశ్వరుని తనయ చెలికత్తెలతోఁ గూడ పాండురంగనిఁ జూచుటకుఁ బండరిపురమునకు వచ్చి, చెలికత్తెలతోఁ గూడ జలకమాడుట కొక తీర్థమున దిగి, అచట హరిదాసమును జూచి యాశ్చర్యపడి చెలికత్తెలును, దానును మిక్కిలి శ్రమపడి తుదకుఁ దానిని పట్టుకొనఁగలిగిరి అట్లు పట్టుకొని కొంత సేపు దానితో నాడి, వేడుకకొఱకు రాజపుత్రిక కప్ప యనిన భయపడు నొక ముసలిబ్రాహ్మణునిమీఁద హరిదాసమును పడవైచెను. ఆ పాఱుఁడు కోపించి చెలికత్తెలతోఁ గూడ నా రాజకుమారి భేకరూపమును పొందునట్లు శపించెను. తోడనే వా రందఱును కప్పలయి హరిదాసమును సేవించుచుండిరి. హరిదాసమును ఆ యాఁడు కప్పలతో సుఖముగఁ గాలము గడుపుచు వానియందు సంతానభాగ్యమును కూడఁ బొందెను. సంతానప్రాప్తియే శాపాంతమగుటచే అయుతుఁ డా కప్పరూపు విడిచి, నిజరూపమును బొంది, జ్ఞానియై ముక్తిఁ బొందెను.

అయుతుఁ డెంత పట్టుదల కలిగియున్నను గృహస్థాశ్రమస్వీకృతి తప్పినది కాదు. కాన ఆ యాశ్రమము నెవ్వరును నిందింపరాదు.

(పాండురంగమాహాత్మ్యము)

---

# పుష్పగంధి

కళింగదేశమునకుఁ దిలకాయమానముగ పుండరీక మను పట్టణ ముండెడిది. దానిని సంపాతి యను రాజు పాలించుచుండెను. అతఁడు పేరు పెంపులు గలవాఁడు; సద్గుణగరిష్ఠుఁడు. ప్రజాపాలన మున శ్రీరామచంద్రున కెనయగువాఁడు. అతని భార్యయగు చంద్రరేఖ అన్నివిధములను భర్త కనురూపురాలు. బిడ్డలు లేక పోవుట యను లోప మొక్కటితప్ప వారి కెట్టి లోటును లేకుండెను.

సంతానార్థియగు నా రాజు పరమశివునిఁగూర్చి ఘోరమగు తపం బొనరింపఁగా నా మహేశ్వరుని దయవలన నతనికిఁ జంద్ర రేఖయం దొక సుపుత్రిక యుదయించెను. ఆ బిడ్డ జన్మించిన వెంటనే రాజు జ్యోతిష్కులను రావించి, బాలికజన్మనక్షత్ర శుభా శుభముల నెఱిఁగింపవలె నని ప్రార్థించెను. వారును పరిశీలించి "ఓ రాజా! ప్రస్తుత మీ బాలికయెడ గండదోషము లెవ్వియు కానరావు; కాని యీ బిడ్డకు వివాహమైన తొమ్మిదినాళ్లకీమె భర్త బ్రహ్మరాక్షసునివలన మృతిఁజెందును" అని విన్నవించిరి.

ఆ మాటలు విన్నవెంటనే సంపాతి మూర్ఛాగతుఁడయి కొంతవడికిఁ దెలివి తెచ్చుకొని, యిట్లు విచారింపఁదొడఁగెను:— "అయ్యో! దైవమా! ఇట్టిగతి తెచ్చిపెట్టితివేమి? నేను రాజునని గర్వించి ఎవ్వరి కెట్టి హానిని కలిగింపలేదు. అతిథులకుఁ బెట్టక గడపివుచ్చలేదు. బ్రాహ్మణధనము నపహరింపలేదు. గురువుల నవమానింపలేదు. సేవకుల కన్యాయము చేయలేదు. ఇట్టి నాకు ఇట్టి ఘోరము సమకూర్చుటకుఁ గారణ మేమో తెలియదు. కొడుకు నిచ్చునని కొండంత యాశతో శివునిఁగూర్చి తపస్సు చేయఁగా

నా కోరికకు విపరీతముగా కూతురు కలిగినది. ఆ బిడ్డయైనను కన్నుల యెదుట నెమ్మదిగ నుండఁగా చూచి ఆనందింతమనుకొన్న దైవము చూచి యోర్వఁజాలకపోయెను. ఇంతకంటె బిడ్డలు లేకుండుటయే మేలని తోఁచుచున్నదే!"

రాజిట్లు విలపించుటఁ జూచి మంత్రి పురోహితులు "ప్రభూ! ఎప్పుడో జరుగుదానినిగూర్చి యిప్పటినుండియు విచారింపనేల? ఏమో! ఆమె యదృష్టము బాగుగనుండిన ఏ దయామయుండైనను, ఏ పుణ్యాత్ముఁడయినను-ఈ యాపదను తప్పింపఁగూడదా? ఇంతకును అప్పటికిఁ దగినట్లు చూడవచ్చును. ప్రస్తుతము మీ తపఃఫలమును, శివుని వరప్రసాదినియు నగు నీ బిడ్డకు జాతకర్మాదికము నొనరింపఁదగును. ప్రభువులు ధైర్యము నవలంబింపవలెఁగాని, ఇట్లు దిగులుపడరాదు." అని ధైర్యము చెప్పిరి. రాజును కొంతవడికి ధైర్య మవలంబించి జాతకర్మాదికమును నడిపించి, పదునొకండవ దినమున ఆ బాలికకు పుష్పగంధి యను పేరు పెట్టెను. పుష్పగంధి శుక్లపక్ష చంద్రరేఖవలె దినదినాభివృద్ధిఁ గాంచుచు, పదునాఱు వత్సరములయీడు వచ్చునరికిఁ బరిపూర్ణకళావిలసితయై ఆ యా వయస్సులకుఁ దగిన విద్యలను నేర్చి, భూతలంబున వెలసిన దేవకన్యయో యన సొబగుమీఱి యుండెను. ఆమె తలిదండ్రుల కల్లారుముద్దుగాఁ బెరుగుచు, చెలికత్తెలతో వినోదించుచు పూఁదోఁటల విహరించుచుండును.

మాళవ దేశాధీశ్వరుఁ డగు నందనరపతి పుత్రుఁడును, సద్గుణమండనుండు నగు రత్నమండనుఁ డను రాకొమరుఁడు తన మిత్రుఁడగు నింద్రదత్తునితోఁగూడ వేఁటకయి యిలు వెడలి వేఁట తమకమున దేశదేశములఁ దిరుగుచుఁ గళింగ దేశమును జేరి, పుండరీకపురము చేరువఁ బూలతోఁటఁ బ్రవేశించి, యట సఖీజన

సమేతయయి విహరించుచున్న పుష్పగంధిం గాంచెను. చూచు టయే తడవుగ రాజకుమారున కామెపైఁ బ్రేమ యుదయించెను. రాజపుత్రికయు నీతనిం గాంచి యతనిపయిఁ బ్రేమగల దయ్యెను. ఇంద్రదత్తుఁడును, రాజపుత్రిచెలికత్తెలును ఈ సంగతిని గ్రహింపఁగలిగిరి. ఇంద్రదత్తుఁడు తన మిత్రునితో మాటలాడి, యతని కోరికను దెలిసికొని—తమకుఁ గొంత దూరములో రాజ పుత్రిక నాడుచున్న చెలికత్తెలను సమీపించి, తమ వృత్తాంతమును, రాజపుత్రుని యవస్థను వివరించెను. ఆ చెలికత్తెలును తమ చెలిపేరిని, ఆమె యవస్థను వెల్లడించిరి. పిదప ఇంద్రదత్తుఁడు శూన్యహృదయముతో నున్న రత్నమండనుని తమ దేశమున కతి కష్టముమీఁదఁ దీసికొనిపోయెను. అట్లు కొనిపోయి యాఁడువారి యెడ నిట్టి మమత కూడదనియు, ఆ కన్యక కాకున్న అంతకంటె నందకత్తె వేఱొకతె లభించుననియు నెన్నియో విధముల నింద్ర దత్తుఁడు మిత్రుని బుద్ధిని పుష్పగంధినుండి మళ్లింపఁజూచెను. కాని కొంచెమైనను లాభము లేకపోయెను.

కుమారుఁడు నాఁడునాటికిని జిక్కిపోవుచుండుటను జూచి, రాజు దిగులుపడి యతని విచారమునకుఁ గారణమును ఇంద్ర దత్తునివలనఁ దెలిసికొని, పుత్రునితో నిట్లు పలికెను:—"కుమారా! ఇట్టి స్వల్పవిషయమున కింత విచార మేల ? ఏల నిష్కారణముగ మనోవ్యథను పెట్టుకొని కృశించిపోయెదవు ? నీవు కోరిన కన్యనే నీ కిచ్చి యుద్వాహ మొనరింతును. ఇది నా కెట్లును అసాధ్యము కాదు. కళింగరాజగు సంపాతి యెవరికంటె ఘనుఁడు ? మూఁడు నిమిషములలో—యుద్ధమున నతని నోడించి నీవు కోరిన పుష్ప గంధిని దెచ్చి నీకు వివాహము గావించెదను. విచార ముడుగుము."

రా జిట్లు పలికి కళింగముపయి దాడివెడలుటకు సేనలను సర్వసిద్ధముగఁ జేయ సేనాధిపతుల కాజ్ఞ యిచ్చెను. ఈ వృత్తాం

తముఁ దెలిసికొని నందుని పురోహితుఁడగు చంద్రశర్మ యను విప్రుండు రాజును దర్శించి, "ప్రభువరా! తొందరపాటు వలదు. సామ, దాన, భేద, దండోపాయములందు కడపటి యుపాయ మధమము. తొలుతటి యుపాయము లెవ్వియు నుపయోగింప నప్పుడు దండము గ్రాహ్యము. కళింగాధిపతియగు సంపాతి ఎంతయు నుత్తముఁడు. మీకోరిక నాతఁ డెన్నడును కాదనఁడు. ఈ కార్యము చక్కఁజేయు భారము నామీఁద వైచి గమనింపుఁడు నే నవలీల మన కార్యమును చక్కఁజేసికొని వచ్చెదను." అని పలికి యతని యానతిఁగొని పుండరీకపురముఁ జేరి, రాజును సందర్శించి, తన యాగమనప్రయోజనమును వివరించెను.

సంపాతి యంతకు మునుపే పుష్పగంధిచెలికత్తెలవలన ఆమె రత్నమండనుని ప్రేమించిన సమాచారమును గుఱుతెఱుఁగుటచే ఆమెను మాళవరాజకుమారున కిచ్చి వివాహ మొనరింప నంగీకరించెను. కాని పుష్పగంధి పుట్టుకసమయమున జోస్యులు చెప్పిన మాటలు తలఁపునకు రాఁగా, దిగులుపడి—ఉన్న సంగతిని గప్పిపుచ్చి పెండిలి జరిగించినచో ద్రోహమగునని తలంచి, పుష్పగంధి జన్మవృత్తాంతమును, జోస్యుల మాటలను చంద్రశర్మకుఁ జెప్పివైచెను. అతఁడును ఏమియుఁ జెప్పఁజాలక వెనుదిరిగి వచ్చి, తమ ప్రభువున కా వృత్తాంతమును సాంతముగా విన్నవించెను. అది విని రాజు అదరిపడి "మంచిది. చచ్చినంతటి కలఁగని మేలుకొన్నట్లయినది. ఎక్కడి పుష్పగంధి! ఎక్కడి రత్నమండనుఁడు! వీరిరువురికి సంధాన మెట్లు? ఇట్టి విపరీతప్రేమ యెట్లు కలిగె? అంతయు దైవమాయ! ఇప్పటికయినను మేలుకొంటిమి. సంపాతి యోగ్యుఁడు; ఉత్తముఁడు. తన పుత్రికయెడఁగల ప్రేమతో ఉన్న దానిని దాచియుంచక జోస్యులమాటప్రకార మామె భర్తృఘాతిని యనుటను బయలుపెట్టెను." అని కొంతవడికి స్వస్థచిత్తుఁ

డయి పుత్రుని యొద్దకుఁ బోయి, పుష్పగంధి సంగతిని దెలిపి, యామెయెడఁగల వ్యామోహమును విడువవలెనని ప్రార్థించెను; ఆమెకంటెను అందకత్తెయగు కన్యను పెండిలిచేసెదనని మాట యిచ్చెను ఏమి చెప్పినను రాజపుత్రుఁ డిష్టపడ లేదు. ఆమెనుండి తన మనస్సు మఱలఁజాలదనియు, ఆమెయెడఁగల ప్రేమతోను, విరహవ్యథతోడను బాధపడి చచ్చుటకంటె - ఆమెను పెండ్లియాడి వారముదినము లయినను ఆనందముతో కాలము గడపుట మే లనియు, ఆమీఁద బ్రతుకుట దైవాధీనమనియుఁ దెలియఁజేసెను. తన నొసటిపయి విధి మరణమునే వ్రాసియున్నచో ఈ రీతిని కాకున్నను, మఱి యేరీతినయినను అది సంభవించియే తీరుననియు, తన లలాటలిపి వేఱుగా నున్నచో ఎట్లయినను ఆ చావు తప్పిపోవు ననియు నాతఁడు తండ్రికిని, తక్కిన హితులకును జబాబిచ్చెను.

నందుఁడు తన కొమరుని మాటలు విని, యాతని పట్టుదలకు మిగుల విచారించి వెచ్చని నిట్టూర్పులను విడిచి, తనకుఁ గర్తవ్యము నుపదేశింపవలెనని మంత్రి, పురోహితులను బ్రార్థించెను. బుద్ధిమంతుఁడును, పురోహితులకుఁ బెద్దయు నగు చంద్రశర్మ రాజకుమారునిజాతకమును చూచి, లెస్సగఁ బరిశీలించి గండము తప్పుటకుఁగూడ నవకాశ ముండుటను గమనించి, రత్నమండనుని కోరిక మేరకు పుష్పగంధితోడి వివాహము జరిపించుటయే కర్తవ్యమనియు, రాజపుత్రుని యాయుష్యమునకుఁ దాను పూఁటగా నుందుననియుఁ జెప్పి యొప్పించెను. ఎట్టకేలకు రాజు నందుల కంగీకరించి, తమ సమ్మతిని కళింగేశ్వరునకుఁ దెలిపెను. పిదప పుష్పగంధితో రత్నమండనునకు మహావైభవమున నుద్వాహము జరిగెను. సంపాతి తన యల్లునికి లెక్కలేని కానుకల నొసంగి, అతనితోఁ దన కుమార్తెంగూడ అత్తవారింటి కంపెను. ఆ నూత్న దంపతులు అత్యంతసంతోషమున వారము దినములు గడపిరి.

కాలము సమీపించినప్పుడు బుద్ధిమాంద్యము, విస్మృతి కలుగుటయు, మాయగ్రమ్ముటయు సహజము! వివాహమయిన తొమ్మిదవనాఁడు తనకు రాఁగల యాపదసంగతిని రత్నమండనుఁడు విస్మరించి, యానాఁ డొంటరిగ తమ నగరమునకుఁ జేరువనున్న వనమునకు వాహ్యాళికిఁ బోయెను. ఆతఁ డా వనమును బ్రవేశించిన వెంటనే ఒక భయంకరమగు నఱ పాతనికి వినఁబడెను. అది యేమియో యని దిగులుపడి రత్నమండనుఁడు చూచుచుండఁగా వికారపురూపు గల ఒక భయంకరుఁడగు బ్రహ్మరాక్షసుఁడు చరచర నడచుచు నాతనిని సమీపించెను. రాజపుత్రుఁ డతనిని జూచి వెనుకటి సంగతి జ్ఞప్తికివచ్చి దిగులందియును, ధైర్యమును విడువక, ఆ రాక్షసుని యెదుట నిర్భయముగ నిలిచెను. రాక్షసుఁడు రాజపుత్రుని రూక్షముగాఁ జూచి "ఓయీ! అక్కడనే నిలువుము. నేఁడు విధి నిన్ను నా కాహారముగాఁ గల్పించియున్నాఁడు. నా చేఁ జిక్కిన నీ వెచటికిఁ బోఁగలవు? నా కాహారమగుటకు సిద్ధపడుము" అని పలికెను.

విధి నొసట వ్రాసిన వ్రాఁతను దప్పించుకొన నెవ్వరికిని సాధ్యము కాదనియుఁ, దన కెట్లును మరణము నిశ్చయమనియు రత్నమండనుఁడు మనస్సును దృఢపఱచుకొని "ఓ దయామయా! నీకుఁ జిక్కిన నేను తప్పించుకొని పోఁగలుగుదునని ఎన్నఁడును అనుకొనలేదు. తప్పించుకొని పాఱిపోవుటకు నా కిష్టమును లేదు. శరీరము క్షణభంగురము. పుట్టినవారి కందరికిని ఎప్పుడో యొకప్పుడు మరణము నిశ్చయము. ఏ రోగముతోనో బాధపడి నిరుపయోగముగఁ జచ్చుటకంటె ఆఁకలితో బాధపడు ఒక ప్రాణికి తన దేహము నర్పించి, ఆ ప్రాణిని తృప్తిపొందించుట ప్రాణికి ఎంతయు మేలైనపనిగదా! నీకు నా శరీరమును హృదయపూర్వకముగా నర్పింతును. కాని నా మనవి యొక్కటి యున్నది. నేను నా తలి

దండ్రుల కేకైకపుత్రుఁడను. నాకు వివాహమయి నేఁటికి తొమ్మి
దవ దినము. నా తలిదండ్రులును, భార్యయును నాపోకడ తెలియక
తల్లడిల్లుచుందురు. నీవు దయతలఁచి న న్నింటికిఁ బంపినచో నా
బంధువులను కడసారిగా ఒక్కసారి చూచి, నీ కాహారమగు సంగ
తిని దెలిపి, సూర్యుఁడు గ్రుంకకమున్న తిరిగివచ్చి నీ కాహార
మయ్యెదను. నాపై దయయుంచి, నా ప్రార్థనము నంగీకరింపుము"
అని యా రక్కసితోఁ బలికెను.

ఆ మాటల కా నక్తంచరుఁడు వికవిక నవ్వి, "ఓయి పిచ్చి
వాఁడా! నీ మాటలు చాల వింతగ నున్నవి. ఇట్లు నీవంటి బుద్ధి
హీనులు పలికిన పలుకవచ్చును; కాని వినువారికి వివేకము లేదను
కొంటివా? నీ మాటలను నమ్మి నిన్నింటికిఁ బంపుటకు నే నంత
వెఱ్ఱివాఁడను కాను; తిరిగివచ్చుటకు నీవు నంత వెఱ్ఱివాఁడవు కావు.
ఆఁకలిచే కడుపు దహించుకొనిపోవుచుండఁగా నోటికందిన ఆహా
రము నెవ్వరయినను విడువఁగలరా? అట్లు విడిచినచో తప్పించు
కొనిపోయిన ఆ యాహారము తిరిగి కోరి, ఆ నోటిలో వచ్చి పడఁ
గలదా? ఈ పిచ్చియాలోచనలను విడిచిపెట్టుము." అని పలికెను.

రత్నమండనుఁ డాపిదప ఎన్నోవిధముల బతిమాలి, తన
సత్యవచనపాలనమును సమర్థించుచు, ఆడితప్పక తిరిగివచ్చి,
భోక్తల కాహారమయిన పెక్కు ఉదాహరణములను జూపి, యా
రాక్షసుని మనస్సు కరఁగునట్లు చేసెను. ఆ రాక్షసుఁ డెట్టకేలకు
దయతలఁచి "ఓయీ! నీ మాటలనుబట్టి నీవు నమ్మఁదగినవాని
వలెఁ గన్పడుచున్నావు. నిన్ను నమ్మి విడుచుచున్నాను. నీ వింటికిఁ
బోయి శీఘ్రముగ మఱలి రమ్ము. నీవు పోవుటకు ముందు ఒక శప
థమును మాత్రము చేయుము." అని పలికి, "నేను మరలి రానిచో
తాను తినుటకు సిద్ధముగ నున్నతఱిని, ఆఁకలితోఁ దహతహ
లాడుచు అతిథి వచ్చి యడుగఁగా అతనిని గడపువాని పాపమునఁ

బోవుదు" నని రత్నమండనునిచేఁ బలికించి, ఆపిదపనే విడిచెను. రాజకుమారుఁడును మిగుల నానందముతో నింటికిఁ బోయి, తలి దండ్రులను దర్శించి, రాక్షసునివృత్తాంతమును వారికిఁ దెలిపి, అతని కాహారముగాఁ బోవుటకుఁ దన కనుజ్ఞ నీయవలసినదిగా కోరెను. నందుఁ డా మాటలు విని, మిగుల తల్లడిల్లి, నెత్తి, నోరు కొట్టుకొనుచు, తనపుత్రునికిఁ గలిగిన యీ యపాయమును తప్పించుటకుఁ దగిన వెఱవు గానక, వెంటనే తన ముఖ్యపురోహితుఁడగు చంద్రశర్మను రప్పించి, "భూసురోత్తమా! ఇట్లు జరుగఁగలదని మున్నెఱింగియు, నీవు పూఁటగా నుండుటచే ధైర్యముపూని కళింగ రాజపుత్రికతో నా కుమారునకు వివాహ మొనరించితిని. ఆ యాపద ఎట్లును దప్పినదికాదు. నీవు ఏ యుపాయముననయినను ఈ యాపదను తప్పింపవలె" నని ప్రార్థించెను. చంద్రశర్మ ధైర్య ముతో "మహారాజా! మీరు లేనిపోని విచారముల నేల పెట్టు కొందురు? మీకుమారుని గ్రహములు నేఁడుచ్ఛదశయం దున్నవి. అతనికిఁ గొంచెమైనను ఆపద కలుగఁజాలదు. రత్నమండనుఁడు తాను మాటయిచ్చినరీతిని రాక్షసునిఁ జేరిన తోడనే యాతఁడు దయ తలఁచి విడువవచ్చును. మన కట్టి యదృష్టము కలుగఁగూడదా? ఎవరు చెప్పఁగలరు!" అని పలికెను. తన యేకైకపుత్రుని యీ ఘోరస్థితిని దలఁచుచున్న రాజున కీ యుపశమనవాక్యములు రుచింపలేదు. ఇవి యన్నియును ముఖప్రీతి కాడినమాటలే కాని యథార్థములు కావని యాతఁ డనుకొని ఏమిచేయుటకును దోఁచక విచారమున మునిఁగియుండెను.

రత్నమండనుఁడు పుష్పగంధియొద్దకుఁ బోయి, కడసారిగా నామెను జూచి, తనకాల మాసన్నమగుటను దెలిపెను. తక్కినవారి వలెనె ఆమె దిగులొందక బ్రహ్మరాక్షసునికిని, తనభర్తకును జరిగిన

సంభాషణమును పూర్తిగఁ దెలిసికొని, కొంచె మాలోచించి, భర్త నపాయమునుండి తప్పించుట కొక మేటి యుపాయము నాలోచించెను. మగవారిబుద్ధికంటె ఆఁడువారిబుద్ధి నాలుగురెట్లధిక మనుట పొల్లు గాదు. అట్లామె యొక యుపాయము నాలోచించి, ముఖమునఁ జిఱునవ్వు తొలుకాడ, భర్తతో "నాథా! మీరు పోయి, సుఖముగా మరలిరండు" అని పలికెను. కాని తన యాలోచనము నామె యెవ్వరికిని దెలుపలేదు. రాజకుమారుఁడు కాలమును వ్యర్థపుచ్చక, సూర్యుఁ డస్తమించుసమయము సమీపించుటచే నతిశీఘ్రముగ బ్రహ్మరాక్షసుఁ డున్న యడవికిఁ బోయెను.

రాజకుమారుని తలిదండ్రులును, తక్కినబంధువులును, మిత్రులును విలపించుచుండఁగా, పుష్పగంధి యెట్టి విచారమును వెలిబుచ్చక మందహాసముతో మగనిని రాక్షసునికడకుఁ బంపినదని పురజనులు ముక్కుమీఁద వ్రేలువేసికొనిరి. అతని మరణమున కీమెయే కారణ మనియు, ఈమెయే నిజమైన రాక్షసి యనియు, ఇట్టి పడఁతులు లోకమున నెవ్వరు నుండ రనియు వా రామెను తమకుఁ దోచినట్లెల్ల నిందింపసాగిరి. కాని పుష్పగంధి ఆ మాటలను సరకుగొనలేదు.

అక్కడ బ్రహ్మరాక్షసుఁడు సూర్యుఁ డస్తంగతుఁడగు సమయము సమీపించుటం గని యాఁకటిచిచ్చున కడుపు దహించుకొనిపోవ, రాజపుత్రుఁడు రాకుండుటకుఁ గటకటంబడి, యాతని మాటలను నమ్మి విడిచినందులకు పశ్చాత్తాపమును పొందుచుండఁగా, రత్నమండనుఁ డతని యెదుట ప్రత్యక్షమయ్యెను. అతనిని కొంచెము దూరమునుండియే గాంచి, యతని సత్యవాక్పాలనమునకు సంతసించుచు, చెట్టుకొమ్మనుండి రక్కసీఁడు దిగివచ్చి,

రాజపుత్రుని తన రెండు చేతులతోను బట్టుకొని దగ్గఱకు లాగికొని కోరలతో నతని కంఠమును నొక్కుటకు సిద్ధముగా నుండెను.

రత్నమండనుని వెనువెంటనే ఎవ్వరికిని దెలియకుండ పుష్పగంధి ఆ సమయమునకు అచ్చటికి వచ్చి, యా రక్కసిర్రిమోల నిలిచి, చేతులు జోడించి "మహాత్మా! భిక్షము పెట్టుము. తాము తినుటకు సిద్ధముగ నున్నతఱిని అతిథి వచ్చి యడిగినయెడల గడపింపరాదని తమవంటి ధర్మజ్ఞు లెఱుఁగుదురుగదా! తమకు నేను వేఱుగఁ జెప్పవలయునా? నాకు పతిభిక్ష పెట్టుఁడు. నా భర్తజీవములను గాపాడి, వానితోఁబాటు నా ప్రాణములనుగూడ కాపాడుఁడు" అని దీనాతిదీనముగఁ బ్రార్థించెను.

అట్టి సంఘటనకు బ్రహ్మరాక్షసుఁడును, రత్నమండనుఁడును కూడ మిగుల నాశ్చర్యపడిరి. "ఔరా! ఎంతపని జరిగినది! నేను చెప్పిన పాఠమే యీమె నాకు తిరిగి ఒప్పగించినదే! ఈమె నా నోరు కట్టివేసినది! స్త్రీ లెంతకైనను తగుదురు. ఈమె బుద్ధి యపారము!" అని రాక్షసుఁడు విచారించెను. పుష్పగంధి తన ప్రాణములను గాపాడుటకయి పన్నిన యుక్తికి రత్నమండనుఁడు మిగుల సంతోషించెను.

బ్రహ్మరాక్షసుఁ డిట్లు పలికెను:—"అమ్మాయీ! నీ భర్త యొక్క సత్యప్రవర్తనకును, నీ యుక్తికిని మిగుల సంతసించితిని. నీ భర్త నిదిగో! నీకు సమర్పించుచున్నాను. నీవు పెక్కేడులు సుమంగళివయి యుండుము తల్లీ!" ఇట్లు పలికి యతఁడు రత్నమండనుని విడిచివేసెను. రాక్షసుని యీ యౌదార్యమునకు మెచ్చి, దేవతలు విమానమును దెచ్చిరి. రక్కసి తన వికారపు రూపు విడిచి, దివ్యరూపధారియయి, యప్సరోగణ

ములు కొలువ నింద్రలోకమున కేఁగెను. పుష్పగంధియు, రత్నమండనుఁడును అమందానందమున నగరమున కేఁగిరి. వీ రిట్లు బ్రతికివచ్చుటకుఁ బ్రజ లందఱు నాశ్చర్యపడిరి. వారి ధర్మప్రవర్తనయే వారి నిట్లు కాపాడెననియు, పుష్పగంధివంటి యుత్తమపతివ్రతలు లోకమున అరుదనియు, ఆ దంపతులను వేనోళ్లఁ గొనియాడిరి. తన జోస్యము ఫలించినదని చంద్రశర్మ చంకలు గ్రుద్దుకొనెను. తన తపస్సు ఫలించెనని రాజు ముదమున మిన్నందుకొనెను.

ధర్మము లన్నింటను సత్యపరిపాలనము ఉత్తమము: అది యెట్టి యాపదనయినను తప్పింపఁగలదు.

(భోజచరిత్రము)



# భ ర్తృ హా రి

పూర్వము భ ర్తృహరి యను భూపాలుఁ డుండెను. అతఁడు ప్రజలను కన్నబిడ్డలవలెఁ జూచుచు, న్యాయముతప్పక రాజ్య మేలుచుండెను. అతని భార్య యుత్తమపతివ్రత యని నలుగురిలోను గొప్ప పేరు పొందినది. రాజునకును ఆమెయెడ అనురాగము మిక్కుటము.

ఒక నాఁడు రా జంతఃపురమున భార్యతో నిష్టాగోష్ఠి నుండఁగా గొప్ప కోలాహలము వారికి వినఁబడెను. అది యేమో కనుగొని రావలెనని రాజు సేవకుల నాజ్ఞాపించెను. వారు పోయి కనుగొని వచ్చి, యిట్లు పలికిరి:—"ప్రభువరా! ఈ యూర ధనగుప్తుఁడని పేరుపడిన యొక వైశ్యాగ్రగణ్యుఁ డున్నాఁడని యేలినవారికిని విదితము. అతఁడు నేఁ డకాలమృత్యువువాతఁ బడెను. గొప్ప యిల్లాలగు నతని సతీమణి బంధువు లెంత వారించినను, బతిమాలుకొన్నను వినక భర్తతో సహగమనము చేయ నీ మార్గమున శ్మశానభూమి కేఁగుచున్నది. ఈ కోలాహలమున కదియ కారణము."

ఆ మాటలు విని రాజు మిక్కిలి విచారించెను; కాని రాణి పెదవి విఱిచెను. భర్తృహరి యచ్చెరుపడుచు, అట్లు పెదవి విఱువఁ గారణ మేమని భార్య నడిగెను. "మనోహరా! కోమటిభార్య శీలవతియే కావచ్చును. కాని యుత్తమపతివ్రత—భర్తమరణమును వినినవెంటనే ఎట్టి ప్రయత్నము నపేక్షింపక వెంటనే మరణింపవలెను. అట్లు మరణించు భాగ్య మామెకుఁ గలుగలేదు. భర్త చావు వినియు మరణింపలేక యామె తన ప్రాణచ్యుతికయి నిప్పులోఁ బడనుండుట నీచము. ఆమె యుత్తమపతివ్రత యన వీలులేని కారణమునఁ బెదవి విఱిచితి" నని రాణి ప్రత్యుత్తర మిచ్చెను.

భ ర్తృ:—ప్రియురాలా! నీ మాట లెంతయు వింతఁగొల్పు చున్నవి. భర్తతో సహగమన మొనరించు వనితయే యుత్తమ పతివ్రతయని నేఁటిదనుక పెద్దలు పలుకుచున్నారు. భర్త చావు విని ప్రాణములను విడువఁగల యువిదలు లోకమున నెన్నఁడైనఁ గలరా? ఉండరనియే నా యాశయము.

రాణి:—ప్రభువు లట్లు తలంపఁ బనిలేదు. లోకము గొడ్డువోలేదు. అట్టి పరమపతివ్రతలను జూపఁగలనని నాకు దృఢవిశ్వాసము కలదు.

రాణి మాటలయెడ భర్తృహరికి నమ్మకము లేదు. రాణి మాటలనుబట్టి తానే అట్టి యుత్తమపతివ్రత నని యామె తలంచుచుండినట్లు ఆతఁడు గ్రహించి, యేతద్విషయమున ఆమెను పరీక్షించుటకు దృఢసంకల్పము కలిగియుండెను.

ఒకప్పుడు భర్తృహరి వేఁటకుఁ బోవలసివచ్చెను. వారము, పది దినము లతఁడు క్రూరమృగములను వేఁటాడుచు అడవిలోనే యుండిపోయెను. తన భార్యను పరీక్షించుట కిదియే మంచి యదనని తలఁచి యతఁడు "రాజు వేఁటతమకమున సాహసించి, యొక వ్యాఘ్రమువాతఁ బడి మరణించె" నని యొక వార్తను కల్పించి, యొక సేవకుని మూలమున అంతఃపురమునకుఁ దెలియఁ బఱచెను. ఆ వర్తమానము చెవిని సోకినంతనే పాపము! మహా రాణి కొయ్యబాఱి నిలువునఁ గూలఁబడి యసువులు బాసెను.

రాణిమాటలు కల్ల యనియు, తానామెకడకు వచ్చి "స్త్రీ వ్రాడిపోయితి" వని చెప్పవచ్చుననియుఁ దలఁచి, వార్తపంపిన వెనువెంటనే భర్తృహరికూడ తన నగరికి వచ్చెను. అంతఃపురమున నే మున్నది? అది చీఁకటింటివలె నతనికిఁ దోఁచినది. రాణి మరణ వార్త యాతనిని మూర్ఛితు నొనరించినది. ఇంత యుపద్రవము

జరుగునని యాతఁడు కలనైనఁ దలఁపలేదు. "బుద్ధిః కర్మానుసారిణీ" అను మాట యేల తప్పును?

భర్తృహరికిఁ బ్రపంచము సర్వశూన్యముగఁ దోఁచెను. తాను నిష్కారణముగఁ దన రాణిని జంపుకొంటినని యాతఁడహోరాత్రములు విచారించుచుండెను. అతని మనస్సు బొత్తిగాఁ జెడిపోయెను. కావున రాజ్యకార్యనిర్వహణభారము మంత్రుల పయినే పడవలసివచ్చెను.

ప్రధానామాత్యున కిది యంతయు నగమ్యమయి యుండెను. రాజుస్థితి కాతఁడు మిగుల దుఃఖించి, ఎట్లయినను అతని విచారమును పోనడంచి, మంచిదారికి తీసికొనిరావలె నని విశ్వప్రయత్నము లొనర్చుచుండెను.

ఒకనాఁడు రాజునకు తన సౌధము సమీపమున నెవ్వఁడో బిగ్గఱగ రోదనము చేయుచున్న ధ్వని వినవచ్చెను. అది యేమో కనుఁగొని రావలెనని భర్తృహరి భటుల నాజ్ఞాపింప, వారు పోయి, తెలిసికొనివచ్చి, ప్రభువున కిట్లని విన్నవించిరి:—— "మహాప్రభూ! వేఱేమియును కాదు; సన్న్యాసి యొకఁడు పగిలిపోయిన తనకుండను తలఁచి, దాని పెంకులను పట్టుకొని మిగుల వాపోవుచున్నాఁడు."

భర్తృహరి మిగుల ఆశ్చర్యపడెను. సన్న్యాసి యేమి? పగిలినకుండఁగూర్చి వాపోవుట యేమి? నశ్వరములగు లౌకికవిషయములను విడిచి, ఇంద్రియనిగ్రహము కలిగి, మోక్షసాధనచేయు యోగి యొక మృణ్మయపాత్రము నశించినందుల కిట్లు విలపించుటయా? అతని కేమియు బోధపడలేదు. ఇం దేమి విశేషమున్నదో తెలిసికొనవలెనని, అతఁడు తన భృత్యులను పంపి యా సన్న్యాసిని తనయొద్ద కెట్లయినను దీసికొనిరావలెనని యాజ్ఞాపించెను. వారును సన్న్యాసికి సాగిలఁబడి మ్రొక్కి, తమ ప్రభువు కోరికను

తెల్పి, బతిమాలి రాజభవనమునకుఁ దీసికొనివచ్చిరి. రా జాతనిని గౌరవించి యుచితాసనమునఁ గూర్చుండఁబెట్టెను. పిదప వారి కిట్లు సంభాషణ జరిగినది:—

రాజు:—సన్న్యాసులగు మీరు విచారించుచుండుటకుఁ గారణ మేమి ?

సన్న్యాసి:—రాజా ! నీవును రాజ్యమను నాశ్రమమున మునివి. నీవును దుఃఖించుచున్నట్లున్నావు. దానికిఁ గారణ మడుగ వచ్చునా ?

రాజు:—ఉత్తమపతివ్రతయు, నా ప్రేమనిధానము నగు భార్యను చేఁజేతులఁ జంపుకొంటిని. అందులకై దుఃఖించు చున్నాను.

సన్న్యాసి:—రాజా ! నేనును నా ప్రేమనిధానమగు కుండను చేఁజేతుల జాఱవిడిచి పగులఁగొట్టుకొంటిని. అందుచే నేనును విచారింపవలసివచ్చుచున్నది.

రాజు:—(నవ్వుచు) అయ్యో! కుండ పోయిన ఇంత విచార మేల ? మఱియొక దానిని సంపాదింపవచ్చునే !

సన్న్యాసి:—రాజా ! భార్య పోయిన నీవును విచారింప నక్కరలేదే ! మఱియొకయుత్తమ వనితను నీవు వివాహమాడ వచ్చునే ! దాని కింత విచార మేల ? నీకు భార్య యెట్లో నాకుఁ గుండకూడ నట్లే !

రాజు:—పునర్వివాహమా ! అది కలలోనివార్త ! అట్టి యుత్తమపతివ్రత ప్రపంచమున ఎచ్చోటను లభింపదు.

సన్న్యాసి:— నాకుండమాత్రము సామాన్యమనుకొంటివా? నేను దానితోనే పిడుకలు తెచ్చుకొనుచుంటిని. నిప్పు, నీళ్లు దాని తోనే తెచ్చుకొనుచుంటిని. అదియే నా భిక్షాపాత్రము. పదార్థ

ముల నందే దాపత్రికము చేయుచుంటిని. వంటకును అదియే. అదియే నా భోజన పాత్రము. నిద్రించునపు డదియే నా తలగడ దిండు. చింతామణివలె అది నా పనుల కన్నింటికిని ఉపయోగపడు చుండెను. అట్టి కుండను నిర్మింప వే ఱే కుమ్మరికిని సాధ్యము కాదు. అది పోయినచో విచారింప నక్కఱలేదా? రాజా! నీవే యోచింపుము.

రాజు:—యోగివర్యా! నీవు నా భార్యను నీకుండతోఁ బోల్చుచు, మన యిరువురి దుఃఖము సమానమైనదే యని తెలుపు చున్నావు. ఇది యంగీకార్యము కాదు; ఉత్తమురాలగు నా భార్యతో నీచమగు నీకుండ ఎంతమాత్రము సమానము కాఁజాలదు.

సన్న్యాసి:—రాజా! ఉత్తమాధమభేదము ఇచ్ఛాకల్పితము. నీదృష్టిలో నీచమైనది నాచూపులో నాణెమైయుండును. నాకు నీచమైనది నీకు ఉత్తమమగును. మనుష్యుల దేహమువలె కుండయు నశ్వరము. దేహము పాంచభౌతికము. ఈ కుండయు పంచభూతముల సాయముననే యుద్భవించినది. కావున నీ భార్య యనిన నీ కెట్టి మమత కలదో నాకుండ యనిన నాకును అట్టి వ్యామోహమే కలదు. కాని ఆలోచించితిమేని మన యిరువురికిని ఈ భ్రాంతి తగదుకదా!

ఆ మాట విని భర్తృహరి వింతగా సన్న్యాసివైపు చూచు చుండెను. సన్న్యాసియు ఊరకుండ లేదు.

సన్న్యాసి:—రాజా! దేహములు నిత్యములు కావనియు, బ్రదుకు నీటిబుగ్గవంటిదనియు నీ వెఱుఁగుదువు. జీవుల జనన మరణములును, సుఖదుఃఖములును వారు పూర్వజన్మమున నిలువ చేసికొనిన కర్మములపయిని ఆధారపడియుండును. ఒకరి మృతికి

గాని, బ్రతుకునకుఁగాని యింకొకరు ఎంతమాత్రమును కారణము కాఁజాలరు. ఆ సంగతిని గ్రహింపక జనులు భ్రాంతిపడి అన్నింటికిని తామే కారణమని వ్యామోహమునమునిఁగి, తలంచుచున్నారు. విద్వాంసు లిట్టి భ్రాంతి పొందియు, వెంటనే తమ వివేకము కలిమిని దెలిపొంది, భ్రాంతినుండి తప్పుకొనుచున్నారు. నీవు వివేకసంపన్నుఁడవు. కాన ఇట్టి వ్యామోహమునఁ బడక, విచారమును విడిచి, నీ ప్రజలను న్యాయముగఁ బాలింపుము.

సన్న్యాసి యిట్లు బోధింపఁగనే భర్తృహరియు విచారము మాని వెనుకటియట్లు ప్రజారంజన మొనరించుచు రాజ్యము పాలించుచుండెను.

ఆ సన్న్యాసి నట్లు విలపింపఁగోరి, అతనిమూలమున రాజునకు జ్ఞానోపదేశము చేయించినది ప్రధానామాత్యుఁడే యని పాఠకులు గ్రహించియే యుందురు.

కుశాగ్రబుద్ధులగు మంత్రు లున్నయెడల ప్రభువుల కష్టములన్నియు తొలఁగును.

(భర్తృహరినిర్వేదము-నాటకము)

# సు శీ ల

మున్ను విష్ణుభక్తుండగు నొక విప్రోత్తమునకు సుశీల యను బాలిక యుదయించెను. విష్ణుభక్తి, అతిథిపూజ, పరోపకారపరాయణత, పాతివ్రత్యము, శాంతము మున్నగునవి యామెకు వెన్నతోఁ బెట్టిన గుణములు. బ్రహ్మ యనుకూలదాంపత్యమును కలిగించుట మిక్కిలి యరుదు. పాపము! ఆ యుత్తమసతి దురదృష్టవశమున నొక లోభికి ఇల్లాలయ్యెను. భర్త తనమెడలోఁ దాళి గట్టినది మొదలు అతఁడే దైవమని నమ్మి, అతఁడు కొట్టినను, తిట్టినను, రట్టువెట్టినను అతని కెదురాడ నొల్లక యోర్చి, సుశీల తన యదృష్టమునే నిందించుకొనుచుండును.

సుశీల వరువాతనే లేచి, కసవూడ్చి, గోమయంబున ఇల్లలికి, ముగ్గులు వెట్టి, పాత్రములు పరిశుభ్రపఱచి, స్నానమొనరించి, వంట సిద్ధముచేసి, దేవతలను పూజించి, నివేదనచేసి, గృహోపకరణములను పరిశుభ్రముగ నుంచును. వారి యిల్లు ఎల్లపుడును లక్ష్మి తాండవమాడుచున్నట్లుండును.

సుశీల భర్త గొప్ప ధనవంతుఁడయ్యును లోభియగుటచేఁ దృప్తిచనక ఏదో విశేషమని చెప్పి రాజుల నడిగి వస్తువులను తెచ్చి, వానిని కోమటుల యిండ్లలో అమ్మించి డబ్బుచేయును. పండిన పంటలను అనుభవింపక పాతరలలో పూడ్చి యుంచును. ఎట్టి బంధువులయినను తన యింటికి వచ్చినయెడల, తమ కాశౌచమని చెప్పి, వారికిఁ దిండి పెట్టకయే పంపివేయును. కర్మము చాలక ఎవ్వరేనియు ధనము నిత్తుమని ముందుగ మాట ఇచ్చినయెడల ఆ సొమ్ము వచ్చువఱకును నిద్రాహారములను విడిచి, ఆ దాతను నక్షత్రకునివలె వెంటాడి యా ధనము వసూలుచేయును.

ఇంటిలో వంటకుఁ గావలసిన పప్పు, బియ్యము లైనను భార్యకుఁ దా నీయవలసినదే. ప్రతిదినము వంటకు సుశీల బియ్య మడిగినచో — మనస్సులో గొణుగుకొనుచు— అట్లడిగినందు కామెను తిట్టుచు, కొసరి, కొసరి, చాలీచాలనిరీతిని ముక్కిపోయిన బియ్యమునే యిచ్చుచుండును. సుశీలకు ఒడలినిండ గుడ్డకును, కడుపునిండ తిండికిని గూడ కరవయిపోయెను. అట్లయినను ఆమె ఏ విషయమునను పతి కెదురాడక ఎట్లో కాలము గడపుచుండెను.

ఒకనాఁ డా యిల్లాలిభర్త కార్యవశమున గ్రామాంతరమున కేఁగఁగా, ఆ వెంటనే అన్ని విధముల వామనమూర్తిని బోలిన బ్రహ్మచారి యొకఁ డా యింటికి వచ్చెను. సుశీల లోనింటి నుండియే యతనినిం జూచి వాకిటికి వచ్చెను. ఆ వడుగు "అమ్మా! ఆఁకలితో మిక్కిలి బాధపడుచున్నాను. పట్టెఁ డన్నము పెట్టి ప్రాణములు నిలుపుము తల్లీ!" అని యాచించెను. సహజదయామతి యగు నా యువతి "అయ్యా! నా భర్త గ్రామాంతరమున కేఁగుటచే ఇంతదనుక వంటకయి ప్రయత్నింపనైతిని. మీ రీ చావడిలో విశ్రమింపుఁడు. గంటలో వంటచేసి పెట్టెదను" అని పలికెను. అందులకా వటుఁడు "అమ్మా! నాకు ఏడు దినముల నుండియు తిండి దొఱకలేదు. గంటకాలము తిండిలేనిచో నా ప్రాణములు నిలువఁజాలవు. పాడి యన్న మున్నను సరే; లేదా చలిది యన్నమైనను సరే! ఒక పోఁకయంత పెట్టితివా—చాలును. నా యాఁకలి తీఱును. పర్యుషితమును దినిన నాకు పాపము కలుగునని నీవు తలంతువేమో! అట్టి యనుమాన మక్కఱలేదు. నా తపోబలమున ఆ పాపమును పోఁగొట్టుకొనఁగలను." అని పలికెను.

వటుఁ డిట్లు పలికెనే గాని, అట్టి తపోనిధికిఁ జలిది పెట్టుటకు సుశీల మన స్సంగీకరింపక "మానిసత్తమా! మీవంటి మహాత్ములకుఁ జల్ది పెట్టుటకు నాకుఁ జేతులు రాకున్నవి. గడియలో

వంటచేసి పెట్టెదను; ఆరగింతురు గాని; కొంచెము సేపు తాళుఁడు" అని పలుకఁగా, ఆమెమాటల కడ్డమువచ్చి బ్రహ్మచారి యిట్లనెను:—"అమ్మా! మేము పుణ్యక్షేత్రములను సేవించుటకు దేశములఁ దిరుగు యాత్రికులము. ప్రయాణకాలమున ఆచారము తప్పి నడచినను, తప్పులేదని పెద్ద లందురు. ఒక్కయింత మెదుకు, ఇన్ని నీళ్లు ఇచ్చి నా ప్రాణములను కాపాడుము. చలిది పెట్టిన పాపము నీ కెంతమాత్రమును లేదు. అభ్యాగతుఁడు స్వయముగా విష్ణువే యని విచక్షణులు పలుకుదురు. ఆ యతిథి మనోవాక్కాయకర్మములచే నయిన పాపములను పోఁగొట్టి గృహమేధికి శాశ్వత సుఖముల నిచ్చును. అమ్మా! తీర్థముల నన్నింటిని వేగముగా సేవింపవలెనను ఆతురతతో ఒక్కచోట కాలు నిలుపక ప్రయాణములు చేయుటచే వేళపట్టున తిండి లేదు. అసలు తిండి దొఱకుటయే కష్టముగ నున్నది. నీపైని ఒట్టుపెట్టుకొని చెప్పుచున్నాను. ఆఁకలి బాధచే—నాకు కలలు వచ్చినను కూటినిగూర్చిన కలలే వచ్చుచున్నవి. ఆఁకలిబాధను నేనే కాదు; ఎవ్వరును సహింపఁజాలరు కదా! నాతోడి ప్రయాణికులగు వడుగులు పిక్కబలము గలవారగుటచే మేము చేరఁదలఁచుకొన్న పౌండరీక క్షేత్రమునకు-పాండురంగని దర్శనార్థము చనిరి. నేను పొట్టకొఱకుఁ జూచుకొనుచు వెనుకబడితిని. 'కూటిబీద తోడుతప్పు'నను సామెత యుండనే యున్నది కదా! ఏ రీతిగా నయినను సరే, ప్రాణములను నిలుపుకొనుటయే యుత్తమధర్మమని పెద్దలు చెప్పుదురు కదా! నీ వనుమానింపక, ఆ చలిదియన్నము పెట్టుము. ఎంత యున్న నంతటితోనే తృప్తిపొందెదను."

సుశీల యిట్లనుకొనెను:—"ఇప్పుడు నాకు విషమస్థితి వచ్చిపడినది. ఏమి చేయుటకును దోఁచకున్నది. ఈ చిన్నవడుగు ఆఁకలిచే నకనకలాడుచున్నాఁడు. అన్నము పెట్టకుండుట మహా

దోషము. పోనీ పెట్టుదమందుమా ? తపస్వియగు నీతనికి చలిది యన్నము పెట్టుట మహాపాతకము. పోనీ, ఆ పర్యుషితమును పెట్టుదమన్నను, అది చాలునో, చాలదో ! నాభర్త మూటకట్టుకొని పోఁగా మిగిలిన యన్నమే యున్నది! సగము కడుపునకుఁ బెట్టిన మఱియు పాపము! తీర్థయాత్రాపరులు వెళుచలని పెద్దలు చెప్పుదురు. పంతముపట్టి యింకను దెమ్మనినచో నే నెక్కడినుండి తేఁగలుగుదును ? ఐనను ముందేమి జరిగినను జరుగనిమ్ము. దానికయి విచారింపనేల ? ఆ యన్నమునే పెట్టెదఁగాక !"

సుశీల యిట్లాలోచించి 'లోనికి దయచేయుఁడు' అని యాతనిని పిలిచి, కాలుసేతులు కడుగుకొనుటకు జలమిచ్చి, యరఁటియాకు వేసి, చలిదికుండ నూడ్చి, నీరులేకుండ ఓడ్చి, మల్లెపూవులవలె మిలమిలలాడు చలిదియన్నమును పెట్టి, గడ్డపెరుగు వడ్డించి, ఊరుగాయ నంజుకొన వేసి, పరిశుద్ధజలమును పాత్రములో త్రాగుటకు అమర్చెను. ఆ వటువు ఆఁకటిపెల్లున పరిషేచనము చేయకయే ప్రాణాహుతులను గ్రహించకయే రెప్పపాటుకాలమున ఆ యన్నమును తినివేసి, మీఁదు చూచుచు కొంచెము సేపటికి ఆమెతో—"అమ్మా! ఈ సగముతిండివలన ఆఁకలి చెలరేఁగినది. నీ వొకసారి కుండఁ జూడుము. అం దేమి మిగిలినను తెచ్చి వడ్డింపుము. ఒక్క మెదుకైనను విడువకుము" అని పలికెను. అంత నామె చేయునది లేక తనకొఱకు ఉంచుకొనిన పాడియన్నమును నిశ్శేషముగఁ దెచ్చి వడ్డించెను. ఆ యన్నమును వడ్డించి కాఁగుచున్న పాలను పోయఁగా వటువు కలుపుకొని—ఈవలివారు ఆవలివారి కందించినట్లుగ అవలీలగ భుజించి, 'ఇంకను అన్న మున్న యెడలఁ బెట్టు' మని వటువు మోమోటమి లేక యడుగఁగా, ఆమె చేతులు జోడించి "మహానుభావా ! అన్న మిఁక కొంచెమును లేదు. ఉన్నదంతయు నూర్చి పెట్టితిని. నా భర్త గ్రామమునకుఁ బోవుతఱిని అటుకపయి ఎవ్వరికిని

దెలియకుండ దాఁచుకొనిన భక్ష్యములు కొన్ని యున్నవి. వానిని తెమ్మందురేని తెచ్చెదను." అని పలుకఁగా బ్రహ్మచారి "ఓహో! భక్ష్యము లున్నవా? ఇఁక నేమి? భక్ష్యము లెన్ని తెచ్చినను మా కభ్యంతరము లేదు" అని పలికెను.

సుశీలభర్త ఆ భక్ష్యములనుగూర్చి యామెకుఁ దెలుపలేదు. తెలిపినచో ఆమెయే తినివేయునని ఆ లుబ్ధాగ్రేసరుని యనుమానము. లుబ్ధుఁడును, ధనికుఁడు నగు నీతనియొద్దనుండి ఋణము గ్రహింపవలెనని యొక కుశాగ్రబుద్ధి యీతని దయను సంపాదింపఁదలఁచి, కొన్ని మధురభక్ష్యములను కానుక తెచ్చి యిచ్చెను. ఇతఁడు వానిని ఎవ్వరికిని దెలియకుండునట్లు అటుకమీఁద దాఁచి, గ్రామమునకుఁ బోయెను, ఊరినుండి మఱలివచ్చి వానిని సావకాశముగ భుజింపవలెనని సుశీలభర్త కోరిక. ఈ సంగతి సుశీల యెట్లో కనిపెట్టి కడుపునిండని వడుగును తృప్తిపఱచుటకయి వానిని తెచ్చి వడ్డించెను. ఆ భక్ష్యములు కన్పించనిచో భర్త తన్నేమి చేయునదియు ఆమెకు దెలియును. భర్త విధించిన యెట్టి శిక్షనయినను అనుభవించుట కామె సిద్ధపడెను గాని, అతిథిని సగమాఁకటితో లేవనెత్తుట కిష్టపడలేదు. భర్త దాఁచియుంచిన పదార్థముల నన్నింటిని—ఒక్క భక్ష్యమును గూడ విడువకుండ, ఆమె ఆ విచిత్రపుటతిథికిఁ బెట్టెను. ఆ భక్ష్యములన్నింటిని దినియుఁ దృప్తిలేక యా పొట్టి వడుగు తన తిండిపోతుఁదనమునకుఁ దానే లజ్జించుచున్నాఁడో యన తలవంచుకొని కూరుచుండెఁ గాని పీఁటపైనుండి లేవఁడాయెను.

అతని పొట్ట నిండలేదని సుశీల గ్రహించి, మిగుల ఆశ్చర్యపడి "ఈ వటువు చూడఁగా ఇసుకరేణువంత లేఁడు; కుడికెఁడన్నము తినుపాటి వయసువాఁడుగ నున్నాఁడు. ఎంత పెట్టినను

తెప్పపాటుకాలములో మాయము చేయుచున్నాఁడు. ఇంత తినియుఁ దృప్తిపడకున్నాఁడు.

ఇతఁడు మానవమాత్రుఁడుకాఁడు! నన్ను పరీక్షింప మాయావేసమున నేతెంచిన ఇంద్రుఁడో, బ్రహ్మయో అయి యుండవలెను. లేదా నాభవబంధములనూడ్చి ముక్తినొసంగవచ్చిన శ్రీమన్నారాయణుఁడైనను కావలెను. ఇట్టి యగ్నిపరీక్షకు వెనుదీయరాదు.'' అని తలంచుచు, తన్నీ యాపదనుండి రక్షించి, ఆ యతిథియాఁకలిని తీర్పవలయునని అగ్నిదేవునిఁ బ్రార్థించెను. ఆ దేవుని యనుగ్రహము వలన వెంటనే చతుర్విధాహారములు, పంచభక్ష్యములు, అవి, యివి అన నేల? సమస్తపదార్థములును వంటయిల్లు నిండి ఎంత తీసినను తఱుఁగకుండెను. ఆమె ప్రభావమునకు మెచ్చి, దేవతలు పుష్పవర్షముఁ గురిపించిరి. మాయావటువగు శ్రీకృష్ణుఁడు తన నిజరూపముతో ఆ పతివ్రతామతల్లికి - ప్రవిమలాంతఃకరణకు - పరోపకారపరాయణకు - భక్తవరేణ్యకుఁ బ్రత్యక్షమయ్యెను. భగవంతుఁడగు పాండురంగఁ డట్లు ప్రత్యక్షము కాఁగానే సుశీల భక్తివినయములతోఁ బ్రణతు లొనర్చి నుతియించెను. అంత నా దేవదేవుఁ డిట్లనెను :—

"అమ్మాయీ! తొలిజన్మమున నీ వొక ధేనువయి పుట్టితివి. ఒకప్పుడు నీ క్షీరధారపయినుండి గాలి వీచి, ఒక క్షీరబిందువును నా శిరస్సుపయి రాల్చినది. అందువలన నీకు క్షీరాభిషేక మొనర్చిన మహాపుణ్యము లభించినది. ఆ పుణ్యమునకు ఫలితముగ నీ వీ జన్మమున ఒక వైష్ణవోత్తమునకుఁ బుత్రికవయి, నాకు భక్తురాలవయి, పరమపతివ్రతవయి, పేరు పెంపులను గడించుకొనుచున్నావు. ఈ నీ భర్త తొల్లి అకృతసత్క్రియుఁడను విప్రుఁడు; అన్వర్థనాముఁడు. అతని నివాసము వసుధానువను పట్టణము. ఇతఁడు ఘోటకబ్రహ్మచారి. వెనుకటి జన్మములో ఇతఁ

డొనర్చిన పాపములకు మితిలేదు. ధనవంతుఁడై యున్నను పెండ్లి చేసికొనక చెడుతిరుగులు తిరిగెడివాఁడు. సుగుణములు కలవాఁడై యున్నను మంచివారిం జేరక పాషండులతోడ గలిసిమెలిసి తిరుగు చుండెను. బుద్ధిమంతుఁడై యున్నను వేదశాస్త్రముల జోలికి పోక, అశ్లీలసంభాషణలఁ జేయుచుండెను. స్థితికలవాఁడేయైనను తనకుఁ గల సంపద ననుభవింపక ఇక్కడ నక్కడ తిరిగి తిండికయి ఇతరులను దేవురించుచుండెను. బ్రాహ్మణులయు, దేవతలయు సొమ్మునకు ఎగ్గు దలఁచుచు, చాల పేభ్యరాసిగ నుండెను. ఇతఁ డొకప్పుడు ఒక్క వెలయాలితోఁ గలిసి పౌండరీకక్షేత్రమునఁ గొంతకాలము నివసించెను. ఒకనాఁడు ధూపానంతరము కన్నులపండువగు నా యారగింపు టుత్సవమును ఆప్యాయమునఁ జూచెను. ఆ పిదప నీతఁడు పెక్కుచోట్లఁ బెక్కుగతులఁ దిరిగి, కొండొకకాలమునకు మరణించి, నా నైవేద్యమును జూచిన పుణ్యమునకు ఫలముగ నొక యుత్తమబ్రాహ్మణవంశమునఁ బుట్టి నీకు మగఁడయ్యెను. ఆ సుకృతమే లేనియెడల ఇతఁ డెట్టి నరకమునఁ బడియుండునో ఎవరి కెఱుక? ఇతని పాపముల కంత మున్నదా? ఈతఁ డిట్లుత్తమ వంశమునఁ బుట్టినను, పిసినిగొట్టయి, నిన్ను బాధించుటకుఁ గారణము నేనే. నీయొక్క భావశుద్ధిని పరీక్షింపఁగోరి నేనే యీతనికి లోభ, క్రోధములను కలిగించితిని. నీ సౌశీల్యమునకును, భక్తికిని మెచ్చితిని. ఇఁకమీఁద నీ భర్త అతని వెనుకటినడతను మాని, శాంతుఁడయి, ఉదారుఁడయి, నీచెప్పుచేతలలో మెలఁగును. మీరు మణిపూసలవంటి అయిదుగురు పుత్రులఁ గని, అందరి పొగడ్తలకును పాత్రులయి పెక్కేఁడులు కాఁపురముచేసి, అంతమునందు నా సాన్నిధ్యమును పొందఁగలుగుదురు."

పాండురంగఁడు సుశీల కిట్లు వర మొసఁగి, యంతర్హితుఁ డయ్యెను. ఆమె భర్త భగవదాదేశానుసారము భార్య చెప్పినట్లు నడుచుకొనుచు, శాంతుఁడై, అతిథ్యభ్యాగతులను గౌరవించుచు, గుడి గోపురములను కట్టించుచు, లెక్కలేని దానములు చేయుచు, ఉత్తములగు ఐదుగురు పుత్రులఁ గని, మని, అంతమందు ఆమెతోఁ గూడ పరమపదముఁ బొందెను.

ఉత్తమశీల మెప్పటికైనను ఊరకపోదు.

(పాండురంగమాహాత్మ్యము)

---

# బంధుకుఁడు

పూర్వము నందినీ నగరమున ధనవంతుఁడగు నొక విప్రుఁడుండెను. అతనికి బంధుకుఁడు, విపులుఁడు నను నిరువురు పుత్త్రులుత్తమగుణు లుండిరి. ఆ బ్రాహ్మణుఁడు తన యవసానకాలమున ఆస్తిని రెండు సమభాగములుగఁ జేసి, యిరువురు పుత్త్రులకును బంచి యిచ్చెను.

కనిష్ఠుఁడగు విపులుఁడు తనవంతు సొత్తు తీసికొని చిత్రవర్ణ నగరమున కేఁగి, వ్యాపారముచేసి, మిక్కిలి ధనవంతుఁడయి, సుఖముగఁ గాలము గడపుచుండెను. జ్యేష్ఠుఁడగు బంధుకుఁడు మెత్తనిమనస్సువాఁడగుటచే అడిగినవారికెల్ల లేదనక యిచ్చుచు, పెక్కు దాన, ధర్మములను, వ్రతములను జేయుచు, కొలఁదికాలములోనే దరిద్రుఁడయ్యెను. అప్పటి కింకను అతని పుత్రులు చేతికి అందిరాలేదు. అతనికి దినము గడచుటయే కష్టముగా నుండెను.

దరిద్రుని యిల్లు మహారణ్యము. అతని లేమియే పెద్దపులి. ఆఁకలిబాధచే అఱచుచున్న బిడ్డల యేడుపులే ఆ పెద్దపులి యఱపులు. అట్టి పులిని ఇంటినుండి తఱుమ నెవ్వనికి సాధ్యమగును ?

బంధుకుఁడు తన దారిద్ర్యమునకు మిగుల విలపించినను ధైర్యము తెచ్చుకొని యిట్లు తలంపసాగెను :—"నా లేమినిగూర్చి ఎంతమాత్రము నేను అధైర్యపడరాదు. నా తమ్ముఁడు విపులుఁడు మిక్కిలి యుత్తముఁడు; గొప్ప ధనవంతుఁడు. నే నతనియొద్దకుఁ బోయెదను. నాస్థితిగతుల నారసి యాతఁడు మిగుల విచారించును. విచారించి నాకుఁ గోరిన ధనము నిచ్చును. ఆ ధనమును మదుపు పెట్టి నేను వ్యవసాయముచేసి గొప్ప ధనవంతుఁడ నయ్యెదను.

ఏమందురా ? వృత్తు లన్నింటను వ్యవసాయవృత్తియే మేలు. దేశమును పాలించు రాజు యోగ్యుఁడైనచో కర్షకుఁడు సమృద్ధిగ పంట పండించుకొని తాను అనుభవించి, యితరులకు నింత పెట్టును. కానఁ బొలముకాఁపు జీవనముకంటె మేలైన జీవనము వేఱొకటి లేదు. అతఁడు పండించిననే చిక్కిన యందఱి పొట్టలును నిండును. లేనిచో నితరుల జీవనము జరుగుట దుర్ఘటము.

ఇట్లాలోచించి యతఁ డొక శుభదినమున బయలువెడలి తమ్ముని యూరికిఁ బోయెను. సోదరుఁడు తన యింటికి వచ్చుచుండుటను కొంతదూరమునుండియే విపులుఁడు గమనించినను ఆ వచ్చువాఁడు తన యన్నయేయని పోల్చుకొనలేకపోయెను. దారిద్ర్యపీడితుఁడగు బంధుకుం డంత వికారముగ మాఱిపోయి, శల్యావశిష్టుఁడయి యుండెను. విపులుఁడు తొలుత అనుమానించినను, నడకతీరునుబట్టి యాతఁడు తన సోదరుఁడే యని నిశ్చయించి, యతని దయనీయస్థితికిఁ గన్నీళ్లు కాల్వలై పాఱ విలపించుచు, సాష్టాంగనమస్కార మొనరించెను. అన్నయును దమ్ముని లేవనెత్తి మిక్కిలి ప్రీతితోఁ గాఁగిలించుకొనెను. పిదప వారిష్టాగోష్ఠిని మాటలాడుకొనిరి.

బంధుకుఁడు తన తమ్ముని యింట నెలదినము లుండెను. తమ్ముఁడు, నతని భార్యయు, పుత్రులును మిక్కిలి భక్తితోఁ జేయు సేవల కాతఁడు సంతోషమున ఆకాశ మందుకొనెను. కాని తన కుటుంబము సంగతి తలఁచుకొన్నపుడుమాత్రము దుఃఖముతోఁ బాతాళమునకుఁ గ్రుంగిపోవుచుండెను. అచటనే కొన్ని నెలలపా టుండవలెనని తమ్ముఁడును, అతని కుటుంబమును ఎంత నిర్బంధించుచున్నను బంధుకుఁడు తన యూరికిఁ బోవలెనని మిగులఁ దహతహ పడుచుండెను.

ఒకనాఁటి సాయంకాలమున బంధుకుఁడు తన తమ్మునితోఁ బ్రసంగించుచు నా మఱునాఁటి తెల్లవాఱుజామునఁ దన ప్రయాణము నిశ్చయమనియు, ఇఁకఁ దన్నాటంకపఱుపవల దనియు జెప్పెను. కావునఁ దమ్ముఁ డింక అన్న నచట నిలుప నిష్టము లేక యతని ప్రయాణమున కంగీకారమును తెల్పుచు, నడిరేయి నాతనిని తన యింటికిఁ గొంచెము దూరముగాఁ దీసికొనిపోయి, యొక మామిడిచెట్టుక్రిందఁ గూరుచుండఁబెట్టి రహస్యముగా నిట్లు పలికెను:—"సోదరా! నీ స్థితి చాల జాలి కలిగించుచున్నది. ఇంకను ని న్నిటనుండ నిర్బంధింతునన్న, అక్కడ ఇంటిలో వది నెయుఁ, బిల్లలును ఎట్లు బాధపడుచుందురో యని దిగులుగ నున్నది. నీకు విలువగు వస్తువులును, ఎక్కువ బంగారము నిత్త మన్న కాలము బాగులేదు. దారిలో దొంగభయము విప రీతము! క్రూరులగు చోరులు ధనాశచేఁ బ్రాణములను దీయు దురు. మఱియు బంగారమును మోసికొనిపోవుటయును కష్టము. కావున నేను నీకు మిక్కిలి విలువైన మణి నొకదాని నిచ్చెదను. దానిని మ్రింగివేయుము. మురికి గుడ్డలు కట్టుకొని ప్రయాణము చేసినచో ఎవ్వరికిని, ఎట్టి యనుమానము కలుగదు. నీ వింటికిఁ బోయిన పిదప ఆ మణిని వమనముచేసికొని, తగిన వెల కమ్మి, ధనము సంపాదించి, సుఖముగఁ గాలము గడుపుము" అని పలు కుచు, విలువైన మణి నొకదానిని అతనికి మ్రింగ నిచ్చెను. పిదప వా రిరువురును ఇంటికిఁ బోయి హాయిగాఁ బరుండిరి. బంధుకుఁడు వేకువాతనే లేచి, సోదరుఁడు చెప్పినచొప్పున మలినవస్త్రములను ధరించి, శంటిసీనగరమునకుఁ బ్రయాణమయ్యెను.

బంధుక, విపులులు ఏకాంతముగ మామిడిచెట్టుక్రింద మాట లాడుకొనుచున్నపు డొక చోరుఁడు ఆ చెట్టుపైనుండి వారి సంభా షణము నామూలాగ్రముగ వినెను. వారు ఆ చోటు విడిచి

పోయినపిదప ఆ దొంగ యిట్లు తలఁచెను:—"ఈ రోజు సుదినము. నేను ఏ యింటికయినను కన్నము పెట్టినచో ఒక కంచమో, ఒక గుడ్డయో తప్ప వేఱేమియును లభింపదు. ఇంకను పేరాసతో నిలిచి వెదకుచున్నచోఁ బ్రమాదము సంభవింపవచ్చును. కావున నే నీ రాత్రి వేఱె తెచ్చుటను చౌర్యార్థము ప్రయత్నింపక యుదయముననే బాటసారివేసమున నీ బ్రాహ్మణుని వెంటనంటి పోయి, సమయము చిక్కినపు డీతనిని చంపి, అతని యుదరమునం దున్న మణిని సంపాదింతును. అట్లు చేసినచో నేను గొప్ప ధనవంతుఁడ నయి, జీవిత శేషమును శ్రమలేక నిర్విచారముగఁ గడపవచ్చును."

చోరుఁ డిట్లు నిశ్చయించి మలినవస్త్రములను ధరించి ప్రాతఃకాలమున పాంథుని వెంటఁబడి పోసాగెను. కొంచెము సేపటిలో నతనిని గలిసికొని సంభాషించి యతనితో మైత్రి సంపాదించెను. తానును నందినీనగరము చేరువనున్న గ్రామమునకు బోవుచున్నట్లును, తోడి ప్రయాణికుఁడు దొరకినందున మిగుల ఆనందించుచున్నట్లును పలికి, యా చోరుఁడు బ్రాహ్మణునికి తనపయి నమ్మకము పుట్టించెను. అప్పటికి వా రిరువురును చెట్లు, చేమలు ఎక్కువ లేని మైదానమునఁ బ్రయాణము చేయుచుండిరి అట్టిచోట ఆ విప్రునిఁ జంప యత్నించుట ప్రమాదకరమనియు, ఏదయిన అడవిని ప్రవేశింపఁగానే తన కోరికను నెఱవేర్చుకొనవచ్చుననియు దొంగ తలఁచెను. ఇట్లు కొన్ని గంటలసేపు ప్రయాణము చేయునరికి వా రొక యడవిని దాఁటవలసివచ్చెను. దొంగయు నా బ్రాహ్మణునిఁ జంప సిద్ధపడుచుండెను.

తా నొకటి తలఁచిన దైవ మొకటి తలఁచు నను సామెత యెన్నటికిని రిత్తపోదు. దొంగతలఁపునకు విపరీతముగ నొక దొంగలగుంపు ఈ బాటసారుల నిరువురఁ నెదుర్కొనెను. తమ

యొద్ద నేమియు ధనములేదనియు, తాము నిరుపేదల మనియు వీరు వారి నెంత బతిమాలినను లాభము లేకపోయెను. వీరి రూపునకు వీరివేసము లెంతయు ననర్హములనియు, వీరు మోసగాండ్రనియు దొంగలు తలంచి, వారి బట్టలనుకూడ విప్పించి పరిశోధించిరి; కట్టి, కొట్టి బాధించిరి. కాని ఏమియును లాభము లేకపోయెను. పిదప ఆ దొంగలలో ఒకడు "ఇది కాదు; వీరి మోసమునకు ప్రతీకారము మనకు దెలియదని వీరి తలంపు కాబోలును! వీ రున్న దున్నట్లు చెప్పిన సరి! లేదా యిద్దఱిని చంపి పరీక్షింతము. ఇక్కాలమున విలువైన రత్నములను మ్రింగివేసి, మనలకు జిక్కకుండ, మోసముచేసి తప్పించుకొనిపోవుట బాటసారుల కలవాటైనది. వీరు తప్పక మణులను మ్రింగియుందురని నాతలంపు. తొలుత వీరిలో నొకనిం జంపుదము. వానికడుపున మణియున్న రెండవ వానిని చంపుదము. అతని పొట్టలో మణి లేనిచో రెండవవానిని విడిచివేయుదము" అని పలికెను. అతని యభిప్రాయమే సరియైన దని తక్కిన చోరులును అట్లే చేయ నిశ్చయించిరి.

బ్రాహ్మణునితోంగూడ వచ్చుచున్న చోరుడు వారి యభిప్రాయమును దెలిసికొని యిట్లాలోచించెను:-"ఇతరులను చెఱుపం దలంచినవాడు తానే చెడు నను సామెత నేడు నిక్కమైనది. అమాయకుండగు నీ పాఱునిం జంపందలంచి తుదకు నేనే మరణింప వలసివచ్చుచున్నదికదా! ఈ దొంగలు మ మ్మిరువురిని చంపక విడువరు. ఒక విశేషము కలదు. తొలుత బ్రాహ్మణుని జంపిన యెడల అతని పొట్టలో రత్నము లభించును; తరువాత నన్ను వారు ఎట్లును చంపివేయుదురు. అట్లుకాక వారు మొదట నన్నే చంపినచో నా పొట్టలో రత్నము లేకుండుట చూచి, బ్రాహ్మణుని విడిచి పెట్టవచ్చును. ఎట్లును నాచావు నిశ్చయము. నేను ముందు చచ్చి నచో బ్రాహ్మణుండైనను బ్రదుకును. కావున నేనే మొదట

చచ్చుటకు సిద్ధపడి, పాఱుని బ్రదికించి, ఆతనినిగూర్చి తలఁచిన పాపమునకుఁ దగిన ప్రాయశ్చిత్తము చేసికొందును. ఇట్లొనర్చి నచో, పరోపకారముమూలమున నాకు ఉత్తమగతియుఁ గలుగ వచ్చును ''

చోరుఁ డిట్లు నిశ్చయించుకొని దొంగలతో "ఓ దస్యు లారా! మే మెంత బతిమాలినను, యథార్థము పలుకుచున్నను మీరు విశ్వసించుటలేదు. మే మేమి చేయఁగలము? దైవము మా కీ రీతి దుర్మరణమును లలాటమున లిఖించినందులకుఁ జింతిల్లు చున్నాము. గ్రుడ్డిలో మెల్ల యన్నట్లు మీరు మాయెడఁ గొంచెము దయచూపినందులకుఁ గృతజ్ఞులము. మీరు తొలుత నన్ను వధించుఁడు నాపొట్టలో మాణిక్యము లేకున్నచో, మీ మాట యిచ్చిన చొప్పున నా చెలిమికానినయిన ఉసురుతో విడువుఁడు. ఇదియే నా తుదిప్రార్థన'' అని పలికెను. వారు దానికి వల్లెయని యంగీకరించి, తొలుత ఆ చోరుని దేహమునే చీల్చి వెదకిరి. వారికి మణి దొరకలేదు. అపుడు వారు నిష్కారణముగ నొకని ప్రాణమును దీసితిమే యని మనస్సులో విచారించుచు బంధుకునిఁ జంపక విడిచిపుచ్చిరి. అతఁడును బ్రదుకు జీవుఁడా! యని యను కొనుచు, తన సంగాతకాని పరోపకారబుద్ధిని మిగులఁ గొని యాడుచు తన యూరికిఁ బోయి, మణిని విక్రయించి లెక్కలేని దనము నార్జించి, తాను తొలుతఁ దలఁచినట్లు వ్యవసాయమును సాగించి, సుఖముగఁ గాలము గడపుచుండెను.

అమాయకుఁడగు నవివేకికంటె మోసగాఁడగు వివేకి వేయి మడుంగులు ఉత్తముఁడు. మఱియు విమతినెయ్యముకంటె సుమతి తోడి పగయే మేలు.

(కేయూరబాహుచరిత్రము)

# రత్నవతి.

సౌరాష్ట్రదేశమునఁ గల వలభీనగరమున గృహగుప్తుఁ డను వైశ్యుఁ డుండెను. అతఁ డోడవ్యాపారమున కోట్లకొలఁది ధన మార్జించి, సంపదలో కుబేరునిఁ దల దన్నునంతవాఁడని పేరు పడెను. అతనికి గుణరత్నఖని యనఁదగు రత్నవతి యను కన్యా రత్నము కలదు. ఆమెకు పసితనమునందే బలభద్రుఁడను వణి క్పుత్రునితో వివాహమయ్యెను. పసితనముకతమునను, భర్తయన నేమో బాగుగఁ దెలియనందునను, లజ్జావశమునను రత్నవతి తన భర్తయెడ నెక్కువ యనురాగమును బ్రకటింపఁజాలకపోయెను. అందువై బలభద్రుఁడు కోపించి తన భార్యమొగమును జూడ నొల్లకుండెను. రత్నవతి యుక్తవయసు రాఁగా, అందకత్తెలలో మిన్నయని పేరు గడించెను. కాని యామెచక్కఁదన మడవిఁ గాచిన వెన్నెల యయ్యెను. మిత్రు లెంత బోధించినను బల భద్రుఁడు తన మూర్ఖపుఁబట్టుదలను విడువకుండెను. రత్నవతి పుట్టినింటనే యుండుటచే బంధువులును, ఊరివారునుకూడ ఆమెను చులకనగాఁ జూచుచు 'భర్తచే విడువఁబడిన'దని వ్రేలిడి చూపు చుండిరి. భర్త తిరస్కరించుటయుఁ, బ్రజలు నిందించుటయును రత్నవతి మనస్సును మిగుల కలఁతపఱచెను. "అయ్యో! నావంటి నిర్భాగ్యురా లీ లోకమున నుండదుకదా! పేరుపడిన తల్లిదండ్రు లకు బ్రియమైన పుత్రికగా జనించితిని. అన్నింటను తగిన భర్తను పరిణయమాడితిని. కాని దైవము తుదకు నాకు భర్తతో ఎడఁ బాపులు కలుగఁజేసెను. మగని కిష్టములేని యువతి జీవితము ప్రాణ ముతోఁడి చావు. బలవంతముగఁ బ్రాణములను విడుతునన్న—అది మఱియు పాతకము." అని తలపోయుచు రత్నవతి ఏమిచేయుట

కును పాలుపోక క్రమక్రమముగ క్షీణించుచు, దిన మొక యుగముగా కాలము గడపుచుండెను.

ఇట్లుండఁగా ఒకనాఁ డామె యొక సన్న్యాసినిని జూడఁ దటస్థించెను. ఆ యోగిని రత్నవతి దైన్యమునకు కారణము నడిగి తెలిసికొని, "అమ్మాయీ! నీవంటి బుద్ధిమతులు తగిన వెఱ వాలోచించి యిట్టి యెడరు తొలఁగింపఁ బ్రయత్నింపవలెను గాని బేలతనముఁ బూనుట భావ్యము కాదు. నీవు నీ భర్తను కలిసికొనుట కేదయిన మార్గమున్నఁ దెలుపుము. ఆ విషయమున నేను శక్తి వంచనసేయక సాయపడెదను" అని పలికెను. అందులకు రత్నవతి మిగుల సంతసించి ఆ యోగినితో రహస్యముగ నిట్లు చెప్పెను:—

"అమ్మా! మీ పరోపకారబుద్ధికి మిగుల ఆనందముకలుగుచున్నది. నా మనోరథసిద్ధి కొక్కటే యుపాయ మున్నది. మీరు నాయెడ పుత్రికావాత్సల్యము నుంచి, నేఁ దలఁచినరీతిని నెఱవేర్చిన యెడల కార్యము ఫలించునని నాకుఁ దోఁచుచున్నది. మాయింటి పొరుగున నిధిపతిదత్తుఁ డను పేరుపడిన వైశ్యుఁడు కలఁడు. అతని కుమార్తెయగు కనకవతి నాయీడుది. అన్నివిధముల నాపోలికె కలిగియుండును. నే నొకనాఁడు ఆమెకంటె మిక్కిలి ఎక్కువగ అలంకరించుకొని, వారియింటి పయిఅంతస్తుపయి ఆమెతోఁ గూడ బంతియాఁట ఆడుచుందును. నా భర్త తఱచు ఆ మార్గమున నే పోవుచుండును గాన—ఆ సమయమున నీవు అతనిని కలిసికొని, కనకవతితల్లి ప్రార్థించినట్లు తెలిపి, ఎట్లయినను లోనికిఁ దీసికొని రమ్ము. మీ రిరువురును మావద్దకు వచ్చినపుడు నేను ప్రమాదమున బంతిని జాఱవిడిచినట్లు నటింతును. నీ వా బంతిని తీసికొని నాభర్త కిచ్చుచు చిఱునవ్వు నవ్వుచు ఇట్లు పలుకుము:—'కుమారా! ఈ బంతిని జాఱవిడిచిన అందకత్తె యీ యింటి యజమానుని పుత్రికయగు కనకవతి. నీ భార్యకు అనుంగు చెలిమికత్తె. తన

మిత్రురాలియెడఁ గల అభిమానమున నీవు నిర్దయుఁడవనియు, నిలుకడ లేనివాఁడ వనియు నిన్నెల్లపుడును నిందించుచుందును. కాన ఈమె నీకు శత్రుపక్షములోనిది. ఈమె బంతి యిపుడు నీచేతఁ జిక్కినది. దీనిని నీ వీమెకుఁ దిరిగి యిత్తువో, నీవే తీసికొందువో అది నీయిష్టము.' ఇట్లు నీవు పలికినవెంటనే నేనును చిఱునవ్వుతో, ప్రార్థనను దెలుపు చూపులతో-అతనిపై అనురాగము సూచించుచు, అతనిచేరువకు రాఁగలను. అతఁడును చిఱునవ్వునవ్వుచు ఆ బంతిని—అతని ప్రేమనుకూడ నాకు అర్పింపఁగలఁడు. ఎప్పుడో చిన్నతనమునఁ జూచియుండుటచే అతఁడు నన్నొంతమాత్రము గుర్తింపఁజాలఁడు. నేను కనకవతినే యని నమ్మియుండును. ఆపిదప రెండు మూఁడుసార్లు ఇట్లే పరిచయము బలపఱచినపిదప నే నతనిని స్వాధీనపఱచుకొందును. తరువాతిసంగతిని నేను చూచికొందును."

రత్నవతి చెప్పినట్లే యా సన్న్యాసిని చేసి, బలభద్రునికిని, రత్నవతికిని పరస్పరము ప్రేమను కలిగించెను. బలభద్రుఁ డామె తన భార్యయగు రత్నవతియే యని తెలిసికొనఁజాలక కనకవతియే యని తలంచి, ఆమెతో సుఖముగా కాలము గడపుచుండెను.

ఇట్లు కొలఁది దినములు జరిగినపిదప ఒకనాఁడు రత్నవతి భర్తతో ఇట్లు పలికెను:—"నాథా! మనము ఈరీతిని ఈ యూరిలో నుండుట భావ్యము కాదు. ఇదివఱకే చాలమంది మన ప్రవర్తననుగూర్చి అనేకవిధములుగ చెప్పికొనుచున్నారు. మన మీ నగరమును విడిచి వేఱొకయెడకు ఎచ్చటికేని పోవుట మేలని నాకుఁ దోఁచుచున్నది." ఈ మాటలు విని, బలభద్రుఁడును ఆమె చెప్పినట్లే నడచుకొనుట మేలని తలఁచి, లెక్కలేని ధనమును, రత్నవతిని దీసికొని ఒక రాత్రి యెవ్వరికిని తెలియకుండ ఆ నగరమును విడిచిపోయెను.

రత్నవతీ, బలభద్రులు నగరమును విడిచిపోయిన మఱు నాఁడు ఆ సన్న్యాసిని యిట్లు ప్రచారముచేసెను:—"బలభద్రుఁడు తాను నిష్కారణముగ రత్నవతిని తిరస్కరించితి ననియు, అత్త మామల నవమానించితి ననియు, మిత్రుల యుపదేశములను పెడ చెవినిబెట్టితి ననియు మిగుల విచారించి, తన తప్పులను నాకుఁ దెలిపి పశ్చాత్తప్తుఁ డయ్యెను. నిన్న సాయంకాలమే నే నాతనిఁ గలిసి కొంటిని. వా రిరువురును కన్పడకుండుటను బట్టి బలభద్రుఁడే రత్న వతిని తీసికొనిపోయె నని నాకు నిండు నమ్మకము కలదు. అట్లే జరిగియుండును. కొలఁది కాలములో వా రెక్కడ నున్నదియు మనకు తెలియఁగలదు."

ఈ మాటలను వినియు, సన్న్యాసినికి రత్నవతియెడఁ గల వాత్సల్యము నెఱింగియు రత్నవతితలిదండ్రులు ఆమె మాటలనే విశ్వసించి, రత్నవతిని వెదకుటకుఁగూర్చిన ప్రయత్నమును మాను కొనిరి.

అంట రత్నవతీ, బలభద్రు లాఖేటకపురమునకుఁ బయనమై మార్గమధ్యమున నొక దాసిని గొని, కావలసిన వస్తువుల నన్నిం టిని జతపఱచుకొని, కతిపయ ప్రయాణములలో ఆ నగరముఁ బ్రవేశించిరి. బలభద్రుఁడు వ్యాపారమున నిపుణుఁడగుటచే, తన ధనమును గొంత మదుపుపెట్టి వర్తకమును కొనసాగించి కొలఁది కాలములోనే విశేషధనము నార్జించెను; పేరు పెంపులు గడించెను; నగరములోని ప్రధానపురుషులలో నొక్కఁ డయ్యెను. దాస, దాసీ జనంబులు లెక్కకుమించి అతని కూడిగము చేయుచుండిరి.

తరువాత కొలఁది కాలమునకే - మార్గమధ్యమునఁ గొనఁ బడిన మొదటి వృద్ధదాసి రత్నవతిప్రేరణమున బలభద్రునియాజ్ఞ లను లెస్సగా నెఱవేర్పకుండెను. చెప్పిన మాటను సరిగా వినక పెడచెవిని బెట్టుచుండెను. ఎదురుతిరుగుచుండెను. చిన్న చిన్న

వస్తువులను దొంగిలించుచుండెను. అందువలన బలభద్రుఁ డామెను తిట్టి కొట్టి తరిమివేసెను. అందువలనఁ గోపించి యా దాసి బలభద్రునిగుట్టు బయటపెట్టెను. బలభద్రుఁడు చెడ్డవాఁడనియు, సతఁడు ఉత్తమురాలగు తన భార్య నొల్లక, ఆమె చెలిని— నిధిపతి దత్తునిపుత్రికను—కనకవతిని మోసముచేసి తీసికొనివచ్చి యీ నగరమున తగుమనుష్యునిరీతిని తిరుగుచున్నాఁడనియు పలికెను. ఆ దాసిమాటలనుబట్టి లోకు లాతనిని నిందింపసాగిరి. ఈ యుదంతము రాజుచెవినికూడ పడెను. బలభద్రుఁడు తన నగరమున వ్యాపారముపెట్టి లెక్కలేని ధనము నార్జించుచున్నాఁడని రాజున కిదివఱకే ఆతనిపయి అసూయ కలదు. పయికి అతనిపయి ప్రేమను నటించుచున్నను—ఎట్లయినను ఆ ధనమును అపహరించుటకుఁ దగిన యుపాయముల నాతఁ డిదివఱకే యాలోచించుచుండెను. ఆతని కిప్పుడు మంచి సమయము చిక్కెను. బలభద్రుని యసత్ప్రవర్తనమును నిండుసభలో నిశ్చయించి, ఆ యపరాధమునకు జరిమానాగా ఆతని సర్వస్వమును హరింపవలెనని రాజు తలంచి, అతనియెడఁగల తప్పులను వివరించుచు—"ఏమి సమాధానము చెప్పికొనఁగలవో నిండుసభలో దెలుపవలె"నని బలభద్రునికి వర్తమాన మంపెను. ఏమి చేయుటకును దోఁచక బలభద్రుఁడు చింతాక్రాంతచిత్తుండయి యుండుట చూచి, రత్నవతి యిట్లు హిత ముపదేశించెను:—" నాథా ! మీ రీ విషయమయి సుంతయైనను విచారింపఁ బని లేదు. మీరు ధైర్యముతో రాజసభకుఁ బొండు. పోయి, 'రాజును, సభ్యులును నాచేఁ దఱిమివేయఁబడిన పనికత్తె చేసిన ప్రచారము ననుసరించి యిట్టి లేనిపోని తప్పులు నాపైఁ బెట్టుచున్నారని నా తలంపు. ఇది అన్యాయము. నాతో నున్నది నా భార్యయగు రత్నవతి ; వలభీనగరనివాసియగు గృహగుప్తుఁడను ఉత్తమవైశ్యుని ముద్దుపట్టి. కనకవతి యెంతమాత్రమును కాదు.

మీా కీ విషయమున అనుమాన మున్న యెడల వ ర్తమానము నంపి, గృహగుప్తు నిటకు రప్పింపుఁడు. అఁట కనకవతి యున్నదో, లేదో గమనింపుఁడు. వివేకనిధులగు ప్రభువులు మంచి చెడ్డల నరయక పెరవుల్ల మాటలను వినుట అనుచితము' అని పలుకుఁడు. మీా కెట్టి యాపదయును కలుగఁజాలదు."

రత్నవతి పలికిన యీా మాటలకు బలభద్రుఁడు మిక్కిలి యాశ్చర్యపడెను. తాను మనసార ప్రేమించినదియు, తన వెంట వచ్చినదియు తన భార్యయగు రత్నవతియే యని యతఁ డప్పుడు తెలిసికొనఁగలిగెను. ఇట్టి రూపవతిని, బుద్ధిమతిని ఇంతకాల ముపేక్షించినందులకుఁ దన్ను తా నిందించుకొనెను. అతఁడు తన తప్పిదమునకు మన్నింపవలెనని భార్యను బతిమాలి, యామె చెప్పిన చొప్పుననే రాజాస్థానమున కేఁగి, తన సచ్చరిత్రమును ప్రకటించెను. అతని మాటలకు రాజును, సభ్యులును వెఱగొందిరి. రాజు కొందఱు బంట్లను వలభీనగరమునకుఁ బంపి గృహగుప్తుని రప్పించెను, అతఁడు వచ్చి బలభద్రునితో నున్న యువతి తన పుత్రికయగు రత్నవతియే యనియు, బలభద్రుఁడు తన జామాత యనియు ఱేనికిఁ దెలియఁజేసెను. రాజభృత్యులును కనకవతి వలభీనగరమునఁనే యున్నదని తెలిపిరి. ఆఖేటకపురరాజును బలభద్రుని సచ్చరిత్రమునకు సంతసించి, అతనియెడఁ గల యసూయను విడిచి, యతనిని మిగుల గౌరవించెను. గృహగుప్తుఁడు మిగుల సంతోషముతో తన కుమార్తెను, అల్లుని తన పురమునకుఁ దీసికొనిపోయెను. బలభద్రుఁ డచటనే వ ర్తకము చేయుచు సుఖముగఁ గాలము గడపుచుండెను.

పతివ్రతలు తమ కెట్టి కష్టములు వచ్చినను సహించి, ఉపాయమున భ ర్తలను చేరఁగలుగుదురు.

———

(దశకుమారచరిత్రము)

# ఖడ్గతిక్కన

రమారమి ఏడువందల యేండ్ల క్రిందట మనుమసిద్ధి యను పేరుగల మహారాజు నెల్లూరు రాజధానిగా, ఆ చుట్టుప్రక్కల ప్రదేశములను పాలించుచుండెను. గొప్ప బుద్ధిబలముగల తిక్కన సోదరు లాతని రాజ్యము రామరాజ్యము రీతి నున్నటుల విహిత కృత్యముల నొనర్చుచు, రాజుగారి మెప్పులను పడయుచుండిరి. ఆ తిక్కన లిరువురును పినతండ్రి, పెదతండ్రి కుమారులు. ఒకఁడు కవి తిక్కన; రెండవ యాతఁడు ఖడ్గతిక్కన. భారతాది మహాగ్రంథములను వ్రాసిన కవితిక్కన మనుమసిద్ధికి మంత్రియై యుండెను. మహావీరుఁడగు ఖడ్గతిక్కన సేనాధిపతియయి యుండెను.

ఆ రాజ్యమునకుఁ బొలిమేరఁగల 'ఎఱ్ఱగడ్డపాటి'ని కాటమరాజను గొల్లలరాజు పాలించుచుండెను. అతనికి పశువుల సంపదయే అధికము పశువులెక్కువగా నున్నవి కాని, వానిని మేపుటకుఁ దగిన పచ్చికబయళ్లు తని రాజ్యమున లేనందున, ఆ రాజు మనుమసిద్ధికిఁ గొంత పన్ను కట్టుచు, మనుమసిద్ధిరాజు నేలుబడిలో నున్న పచ్చికబయళ్లపయి తన పశువులను మేపుకొనుచుండెను. ఇట్లు కొన్ని యేండ్లు గడవఁగా కాటమరాజు కొంత ప్రబలుఁడయ్యెను. దానితోఁబాటు అతనికి అహంభావమును హెచ్చెను. తుదకు మనుమసిద్ధితోఁగూడ కయ్యమునకు కాలుద్రవ్వ తలఁపతనికిఁ గలిగె. రెండుమూఁడేండ్లు 'పుల్లరి' యిచ్చుట ఎగవేసెను. ఆర్థికపరిస్థితులు బాగులేక పంపలేదేమో యని మనుమసిద్ధి యనుకొనెను. కాని కాటమరాజుదురూహ ఆతనికిఁ దెలియలేదు. తుదకు ఒకప్పుడు 'పుల్లరి' పంపవలసినదని రాజు కాటమరాజునకు వర్తమాన మంపఁగా, ఆతఁడు తన యహంకారమును, స్వాతంత్ర్య

మును వెల్లడిపఱచుచు 'పన్ను కట్టనని' జవాబిచ్చెను. ఆ జవాబు చూచి మనుమసిద్ధి మండిపడెను. కాటమరాజుపయి దండెత్తి యతనికి తగిన శాస్తి చేయవలయునని తలంచెను. అతని యాస్థానములోని సేనాధిపతులును, వీరులును వీరాలాపములు పలుకుచు, కాటమరాజును కదనరంగమున సంహరించుట కాని, కట్టి తెచ్చుట కాని చేయుదు మని ప్రతినచేసిరి.

కాటమరాజునకు బ్రహ్మరుద్రయ్య యను బ్రాహ్మణుఁడు సేనాధిపతి. పిన్నమనాయుఁడను మహావీరుఁ డాతనికిఁ గుడిభుజము. తాను యుద్ధమునకు సిద్ధపడుట యన్యాయ మనియు, మనుమసిద్ధికి పన్ను చెల్లించి, యతనితో సఖ్యము కలిగియుండుట యుచిత మనియు నతనిమనస్సునకుఁ దోఁచుచున్నను, సహజమగు సహంభావమును, బ్రహ్మరుద్ర, పిన్నమనాయల పరాక్రమమును తనకు ప్రోత్సాహకరము లగుటచే కాటమరాజు కదనమునకుఁ గడంగెను.

ఉభయపక్షములవారును పాలేటియొడ్డున 'పంచలింగాల గుట్ట'కు ప్రక్కనున్న పెద్ద మైదానమునందు చేరి, యుద్ధమునకు సిద్ధమైరి. మనుమసిద్ధిసేనలను మహావీరుఁడగు ఖడ్గతిక్కన నడుపుచు, వాని మొగను నిలుచుండి, ప్రోత్సాహము నొసంగుచుండెను. శత్రుసేనలను నడుపుచున్న పిన్నమనాయఁడు దూరమునుండియే తిక్కనను జూచి, సమీపించి నమస్కరించి "తాము యుద్ధమునకు సిద్ధపడక వెనుకకు పోవుటయే మేలు. బ్రాహ్మణులు యుద్ధమునందు ప్రాణ్గాని బాధపడరాదని నా యభిప్రాయము" అని పలికెను. కాని ఖడ్గతిక్కన చిఱునవ్వునవ్వుచు "ఇంతవఱకును వచ్చిన పిదప వెనుకకుఁ బోవుట ధర్మముకాదు గదా!" అని పలుకుచు యుద్ధమునకు సిద్ధమయ్యెను.

కాటమరాజునకు తొలుత ఎక్కువ సైన్యము లేకుండెను. కాని యాతఁడు ద్రవ్య మిచ్చియు, కొన్ని రాజ్యభాగముల నిచ్చె నట్లు వాగ్దాన మొనర్చియు పెక్కుమంది చిన్న చిన్న రాజులను తన పక్షమునఁ జేర్చుకొనెను. అందుచే యాదవుల పక్షమున ఉన్న సైన్యము మనుమసిద్ధి మహారాజు సేనలకంటె కొంత అధికముగానే యుండెను. ఖడ్గతిక్కన యీ సంగతిని గ్రహింపకపోలేదు. దీనిని గ్రహించియే అతఁడు తన సైన్యమున కధైర్యము కలుగకుండ దానిని ప్రోత్సహించుచుండెను.

యుద్ధము మిక్కిలి భయంకరముగ జరుగుచుండెను. వీరులు తమ జీవితములపయి ఆశను విడిచి పోరుచుండిరి. ఖడ్గతిక్కన సేనకు ముందు నిలిచి, త న్నెదిర్చిన ప్రతివీరుల నందఱిని యమసదనమున కంపుచుండెను. కొంతసేపు ఎడతెగకుండ యుద్ధము చేయుటచేత అతనికి ఆయాసము కలుగఁజొచ్చెను. క్రమముగ బలహీనత హెచ్చసాగెను. అవయవములు పట్టుతప్పుచుండెను. మెల్లమెల్లగ తిక్కనకు స్మృతియుఁ దప్పిపోఁగా అతఁడు గుఱ్ఱము మీఁదనే వ్రాలిపోయెను. ఈ యుత్తమజాతితురంగము సంగతి నంతటిని గ్రహించి, యిఁక నచ్చట నిలిచినచో ప్రమాదము సంభవించునను భయముచేతనో, యేమో—రణరంగమును విడిచి తిన్నగా ఇంటికి దౌడుతీసెను. నెల్లూరి పొలిమేరకు వచ్చువఱకును తిక్కనకు—ఈ యంశము తెలియదు. అతని కప్పుడు తెలివి వచ్చెను. 'ఎట్లును ఊరుచేరితిమి కదా! కొంచెము సేపు విశ్రాంతి గైకొని, గాయములకు కట్లు గట్టుకొని, గుఱ్ఱమునకు తిండిపెట్టి, తిరిగి యుద్ధభూమికి పోవలె'నని యాతఁడు నిశ్చయించుకొని, ఇంటికి వచ్చెను.

ఆ కాలపుఁ బ్రజలు తమ ప్రభువును తండ్రినివలె గౌరవించుచుండిరి. రాజ్యమునకుఁ గలిగిన మంచిచెడ్డలు తమవే యని వారి

భావన. మనుమసిద్ధిపయి ఎదురుతిరిగిన కాటమరాజుపయి జను లందరికిని—ఆబాలవృద్ధమును—కోపము, అసహ్యము పెచ్చు పెరిగియుండెను. వానికిఁ దగిన ప్రాయశ్చిత్తము జరుగవలె నని జనులు వేయి దేవుళ్లకు మ్రొక్కులిడుచుండిరి. మహావీరుఁడగు ఖడ్గతిక్కన స్వయముగ యుద్ధభూమి కేఁగుటచే తమరాజునకు జయము కరగతమని నిశ్చయించి, యాతని నేగాక యతని కుటుంబ మును వారు పొగడుచుండిరి.

ఇట్టి సమయమున జనుల తలఁపులకు విరుద్ధముగ జరిగినది. మహావీరుఁడగు సేనాధిపతి పాఱుఁబోతయి ఒంటరిగ ఇంటికి వచ్చె నని యూరు కోడియై కూసెను. తిక్కన తన యింటి గుమ్మ ములో నడుగుపెట్టుచు, తన కష్టమునకు తనవా రెంత బుజ్జగింతురో యని ఎదురుచూచుచుండఁగా ఎవ్వరును ఈతనిని గమనింపక పోయిరి. అరుగుపయిఁ గూర్చుండి సద్గ్రంథకాలక్షేపము చేయు చున్న తండ్రి యితనిరాకను గుర్తింపనే లేదు. తల్లి చూచియుఁ జూడనట్లు నటించెను. భార్య యితనిని చూచి, అటుముఖము త్రిప్పుకొని, ఏదో పనితొందరలో నున్నట్లు లోనికిఁ బోయెను. తనవారు తనయెడలఁ జూపిన యౌదాసీన్యమునకు తిక్కనమనస్సు చివుక్కుమనెను. కారణము తెలియక యాతఁడు కళవళపడు చుండెను.

కొంతసేపు విశ్రాంతిని తీసికొనిన పిదప 'స్నానమునకు రావచ్చును' అను పిలుపు పాతనికి వినఁబడెను. ఆ కంఠస్వరము భార్యది. స్నానపు గదిలోనికిఁ బోవునరి కాతని కక్కడ పసుపు ముద్దయు, స్నానానంతరము ధరించుటకయి ఒక చీరయు, రవికయు సిద్ధపఱుపఁబడియుండెను. తన భార్య తనయెడఁ జూపిన యీ యగౌరవమున కాతఁడు లోలోన మండిపడెను.

పిదప తల్లియాదేశమున భోజనమునకు లేచెను. పప్పు, కూరలు, పచ్చళ్లు, చారు మున్నగుదానితో అన్నమును తిని, పెరుగు కలుపుకొను సమయము వచ్చుసరికి, తల్లి యాతనికి విఱుగు మజ్జిగ పోసెను. ఆతఁడు ప్రశ్నపూర్వకముగా తల్లివంక చూడ, నామె యిట్లు సమాధాన మిచ్చెను :—"నాయనా! నీవు శత్రువీరులను గెలుచుటకై ఏ యుద్ధభూమికి వెళ్లితివో, ఆ ప్రక్కకే మన యావులును మేఁతకయి పోయినవి. అరివీరులకు వెన్నిచ్చి, జంకు గొంకులు లేక—అవమానమని తలంపక—నీవు విఱిగి పాఱివచ్చినట్లే ఆవులును విఱిగి వచ్చినవి. ఆవులు విఱుగుటచే పాలును విఱిగినవి. పాలు విఱుగుటచే పెరుగును విఱిగినది. ఇందు వింతపడుటకును, ప్రశ్నించుటకును అవకాశము లేదు."

జనని యొనరించిన యీ పరాభవముకూడ అతనికి సహింపరానిదయ్యెను. తల్లిమాటవలన—తన కుటుంబము ఈ రీతిని ప్రవర్తించుటకుఁ గల కారణ మాతనికి స్పష్టమయినది. తన పరిస్థితులను కొంచెమయినను విచారింపక అనాలోచితముగ వారు తన పాఱుఁబోతుతనమును నిశ్చయించుటకు తిక్కనకు విచారము కలిగెను. అతఁ డా యన్నము నట్లే దిగవిడిచి వేవేగముగ వీరుని వేషము ధరించి, రణరంగమునకుఁ బో నుద్యుక్తుఁడయి తనవారితో నిట్లనెను :—

"మీరు నాకుఁ గలిగించిన యవమానమునకుఁ గొంచె మైనను విచారింపను. దీనివలన నాకు శత్రువిజయముపట్ల అమిత మగు నుత్సాహము కలిగినది. ఒక విషయమున మాత్రము మీరు పొరబడినందులకు విచారించుచున్నాను. నేను శత్రువులకు జడిసి, వెనుకకు మఱలివచ్చితినని మీ రనుకొనుచున్నారు. నా కాయముపైఁ గల గాయములను చూడుఁడు. నాశరీరమున శక్తి యున్నంతవఱకును, నాకు స్పృహ యున్నంతవఱకును వెనుదీయక

శత్రువులతోఁ బోరుచునే యుంటిని. తుదకు శక్తి లేక గుఱ్ఱముపై నే పడిపోయితిని. అప్పుడే నా ప్రాణములు పోయిన ఎంతయో సంత సించెడివాఁడను. దైవము ప్రతికూలమైనది. నా కీర్తి యవమాన మును విధి నొసట వ్రాసియుండ వేఱుగ నెట్లు జరుగును? నాకు స్మృతి తప్పిపోఁగానే యీ పాడు గుఱ్ఱము నన్నిచటికి కీడ్చి తెచ్చి నది. ఇచటికి నే జీవములతో వచ్చినను, చచ్చినట్లే భావించు చున్నాఁడను. ఇఁక నొక నిముసమైనను, ఇఁట నిలువఁజాలను. రణరంగమునకుఁబోయి శత్రువులను సంహరించి విజయలక్ష్మిని చేకొనివత్తును; లేదా, యుద్ధమున వీరస్వర్గము నలంకరింతును. కాని మీరు తలవంచుకొను పద్ధతిని మాత్రము రాను. ఇదే నా కడపటి మాట. ఇవే నా తుది చూపులు."

ఖడ్గతిక్కన యిట్లు గంభీరముగఁ బలికి కదనరంగమునకు గదలి, చిచ్చఱపిడుగువలె శత్రువులను జించి చెండాడుచు, కలియుగ భార్గవరామునిపగిది కడు భీకరుండై నిరాఘాటముగ నఁట విహ రింపఁజొచ్చెను. అప్పటి యా మహావీరుని విహారము ప్రళయ రుద్రుని తాండవమును దలపించుచుండెను.

శత్రుసేనాధిపతి యిట్లు యుద్ధముచేయుచుండుట చూచి కాటమరాజుసేనలు పరారియగుచుండెను. తమకు అపజయము నిశ్చయమని బ్రహ్మనరుద్రయ్య తలంచెను. కాని యతఁడు తన సేనలను పురికొల్పుచు, లేని ధైర్యమును కలిగించుచు, అవి యుద్ధ మున కభిముఖము లగునట్లు చేసెను. తాను తిక్కన నెదుర్కొ నెను. ఇరువురును సమాన వయో-బల-పరాక్రమవంతులు. వా రెంతయోసేపు ద్వంద్వయుద్ధ మొనర్చిరి. తుదకు ఒకరి తరవారి కింకొకరు బలియయి, ఉభయులును రణరంగముననే వీరస్వర్గము నలంకరించిరి.

తిక్కన యనన్యసామాన్యయుద్ధనై పుణ్యమును, వీరస్వర్గమును జూరగొనుటయును నెల్లూరి ప్రజలకుఁ దెలిసి, అతని నందఱును వేనోళ్లఁ బొగడిరి. అతని బంధువులు అతని మృతికి దుఃఖసాగరమున మునిఁగియు—అతనికిఁగల కీర్తికాయమును జూచి కొంత ఉపశమిల్లిరి.

ఎట్టివారికిని అవమానముకంటె మరణమే యుత్తమము.

---

# విధికృతము

సౌవీరదేశపు రాజగు ధాతకు శుభలక్షణలక్షిత - సుశీల యను పుత్రిక కలదు. ఆమె మిక్కిలి యందకత్తె. ఆమెకు యుక్త వయస్సు రాఁగా తన మేనల్లున కిచ్చి వివాహము చేయవలయు నని రాజు తలఁచెను. తన యన్నకొమరుని కీయ నతని భార్య ధాత్రి తలఁచెను. మేనల్లున కిచ్చుటకు భార్య సమ్మతింపదని యెఱిఁగి, రాజు ఆమెకుఁ దెలియకుండఁగనే పుత్రికయొక్క వివాహమును జరుపుటకుఁ దగిన యత్నములు చేసి, భార్యకుఁ దెలియకుండ తన మేనల్లునిఁ దెప్పించి, రహస్యముగ నొక యింట నుంచెను. అట్లే రాణియును భర్తకుఁ దెలియకుండ కూతురు పెండ్లి జరుపనెంచి, తన మేనల్లుని రహస్యముగఁ దెప్పించి, ఇతరు లెఱుఁగకుండ ఒక గృహమున నుంచెను.

అట్టి సమయమున బ్రహ్మ, విష్ణు, మహేశ్వరు లాకాశ మార్గమునఁ బోవుచు, రాజుయొక్కయు, రాణియొక్కయు తలఁపులకు తమలో అచ్చెరువందిరి. దాంపత్యమును నిశ్చయించు బాధ్యత బ్రహ్మదేవునిది. కాఁబట్టి శివ, కేశవులు విరించిం గాంచి, "యీ కన్య యీ యిరువురిలో నెవ్వనికి భార్య యగు"నని ప్రశ్నించిరి. అందుల కాతఁ డా కన్నియ యీ యిరువురిలో నెవ్వనికిని భార్య కాఁజాలదనియు, ఆమె వేఱొకనిని పెండ్లియాడు ననియుఁ దెలిపెను. అంతతో విడువక, "యీమెకు ఎవఁడు భర్త కాఁగలఁడో వివరింపవలె"నని శివుఁడు బ్రహ్మ నడిగెను. ఆ సమయమున నొక కుంటివాఁడు ఎనుపోతుపయి నెక్కి వచ్చుచుండెను. బ్రహ్మ యతనిని జూపి, 'ఈ కుంటివాఁడు సుశీలకు భర్త కాఁగలఁ' డని పలికెను. ఆ మాటలకు శివుఁడు పకపక నవ్వి, విష్ణువుతో "వింటివా, నీ

కుమారుని కొంటెతనము! ఈ చక్కనిచుక్కను మీ రిద్దతిలో నొకనికిఁగాక యీ కుంటివాని కెవ్వరయిన నిత్తురా? ఇట్లు పలికినను నమ్మనటకు వీలుండవలదా?" అని పలికెను. అందులకు విష్ణువు "బ్రహ్మ అఘటనఘటనాసమర్థుఁడు అతఁడు చెప్పినట్లు జరుగవచ్చును" అని పలికెను. బ్రహ్మయు "శంకరా! నేను పలికినట్లే జరిగితీరు నని ముమ్మాటికిని చెప్పఁగలను. నే నోడిపోయినచో నీవు విధించిన శిక్షకుఁ బాత్రుఁడను కాఁగలను" అని గట్టిగాఁ బలికెను. ఈ మాటలయం దెంత సత్యమున్నదో తెలిసికొనవలయు నని మహేశ్వరునికిఁ గుతూహలము కలిగినది. అతఁడు విష్ణుని జూచి, "నారాయణా, నీవు ఈ కుంటివానిని గరుడునిమూలమున సప్తసముద్రముల కవ్వలివైపునఁ బడవేయింపుము. అప్పుడితనికి ఈ సుశీలతో ఎట్లు వివాహము జరుగునో, బ్రహ్మసృష్టివైచిత్ర్య మెట్లుండునో చూతముగాక!" అని పలుకఁగా విష్ణువు దానికి సమ్మతించి, "కుంటివానిని సప్తసముద్రముల కావల దిగవిడిచి ర" మ్మని గరుడు నాజ్ఞాపించెను. గరుడుఁడు నట్లే యొనర్చెను.

అంతవఱకు నా పిచ్చుకుంటు ఎనుపోతు నెక్కియో—మఱెట్లో—ఎంతకాలమునకయినను అయిదాఱు ఇండ్లు తిరిగి బిచ్చమెత్తికొని జీవించెడివాఁడు. ఇపుడు సముద్రముల కావలియొడ్డున నిస్సహాయుఁడయి, చూడఁ జుట్టమును, మ్రొక్క దైవమును లేక, ఆఁకటిచిచ్చున కడుపు నకనకలాడ నిట్లు విలపింపసాగెను :—

"అయ్యో! ఇంతవఱకును నా స్థితిని గని నగరములోని పుణ్యకాంతలు కూడు పెట్టుచుండఁ గాలము గడుపుచుంటిని. అట్టి నన్ను నిర్దయముగఁ బక్షిరాజు నిర్మానుష్యమయిన యీ చోటి కేల తేఁబలెను?" ఇట్లు విచారించియు నా పంగువు కొంత ధైర్యమూని, "నే విచారింపఁబని లేదు. సర్వలోకములకును రక్షకుఁడైన శ్రీమన్నారాయణుఁడు తగిన యాహారము నిచ్చి పోషించుచుండ లేఁడా?

ఇంతవఱకును ఆ భక్తవత్సలుని వాత్సల్యమేగదా నన్ను కాపాడు చుండినది! ఇఁక మీఁదను ఆ పరాత్పరుఁడే కాపాడఁగలఁడు. ఆఁకటి చిచ్చున నేను బాధపడుచుండఁగా నా దేవదేవుఁ డేల యుపేక్షిం చును?" అని నిశ్చయించి, ఆ నారాయణునే ధ్యానించుచుండెను. ఆ కుంటివాని మొఱ యాలకించి నారాయణుఁడు వాని యాఁకలి తీర్పక యూరకుండుట భావ్యము కాదని తలఁచి, వానికి 'మంచి యాహారము నిచ్చి రావలె' నని గరుడుని కాజ్ఞ యొసంగెను.

ఇది యిట్లుండఁగా—అక్కడ రాణియగు ధాత్రి రాజు చేసిన పన్నాగమును దెలిసికొని, అతని మేనల్లునికిఁ దన కుమార్తె దక్క కుండఁజేయ నెంచి వివిధములగు భక్ష్యపదార్థము లున్న తట్టలో సుశీలాదేవిని కూరుచుండఁబెట్టి, యామె చేతి కొక పూలమాలను, తలఁబ్రాలను ఇచ్చి, "యీ తట్టమూఁత నెవ్వఁడు తెఱచునో అతఁడే నీ భర్త యని తెలిసికొనుము. మూఁత తెఱువఁబడిన వెంటనే నీ వాతని మెడలో నీ పూలమాలను వైచి, తలపయిఁ బ్రాలు పోయుము" అని యాజ్ఞాపించి, యా తట్టను మూసివైచి తక్కినతట్టలతోఁ గూడ వంటయింట భద్రపఱచియుంచెను.. సమయమును చూచి రాణి తన మేనల్లునచటికిఁ బంపఁదలంచెను. తన మేనల్లుఁ డా వంటయింటికిఁ బోయి ఆ తట్టమూఁత యెత్తఁగా, సుశీల యాతని మెడలో హారము వైచు ననియు, ఈ యంశము ధాత మేనల్లునికిఁ దెలియనందున రాజుకోరిక నిష్ఫలమగు ననియు నామె నిశ్చయించెను.

కాని 'తా నొకటి తలఁచిన దైవ మొకటి తలఁచు' నను సామెత నిక్కువ మయ్యెను. విష్ణువుచే నాజ్ఞాపింపఁబడిన గరు త్మంతుఁ డాహారముకొఱకన్ని యెడలఁ బరికించుచు సౌవీరనగరము లోని రాజభవనమునందలి వంటయింట నున్న యా తట్టను

ముక్కునఁ గఱచుకొని పోయి యా కుంటివాని యెదుట నుంచి, యందలి యాహారమును భక్షింపవలెనని చెప్పి పోయెను. పంగు వా తట్టమూఁత తీసినతోడనే - ఈ సంగతి యేమియు నెఱుంగని రాజపుత్రి తన చేతిలోని పూలమాల నాతని మెడలో వైచి, తలఁబ్రాలు పోసి, యా తట్టనుండి బయటికి వచ్చెను. భువనైకసుందరి యగు నా బాలికను జూచి, కుంటివాఁ డత్యాశ్చర్యమున మునింగెను. ఆ బాలిక వేగముగ నొక బంగారు కంచము నమర్చి, యందు వివిధములగు నాహారపదార్థములను వడ్డించి, యతనిని భుజింపఁగోరెను. పేదకు దొఱకిన పెన్నిధివలె - ఆ పంగువు తృప్తిదీఱ నా యా వంటకములను భుజించి, యామెతో నిట్లనెను :—“బాలికామణీ! నీ వెవ్వరవు? ఇట్టి భక్ష్యముల తట్టలో నుండుటకును, నన్ను వరించుటకును గారణ మేమి? నా కీ సంఘటన యంతయును మిక్కిలి యచ్చెరువును గొల్పుచున్నది.” ఆ మాటలు విని సుశీల తన వృత్తాంతమును, తన వివాహమునుగూర్చి తలిదండ్రులకుఁ గల భేదాభిప్రాయములను, పట్టుదలను, తన తల్లి యాదేశమును వివరించి, తాను తట్టలోఁ బ్రవేశించినవఱకును జరిగినసంగతి యిది యనియు, ఆపైసంగతి తనకు తెలియదనియు, తట్ట తెఱచువాని మెడలో పూలమాలవేసి, వరింపవలెనను జననియానతి ననుసరించి తా నట్లొనరించితి ననియు, ఇంతకును ఇట్లు జరుగుట విధిప్రేరితమనియు, దానిని దాట నెవ్వరికిని సాధ్యముకా దనియుఁ దెల్పెను.

“ఔరా! దైవమాయ! బిచ్చ మెత్తుకొనుచు ఎట్లో కాలము గడుపుచున్న నన్ను అట్లు బ్రదుకనీయక సప్తసముద్రములకును ఈవల పాఱవైచెను. తిండికి దిక్కులేక నేను మొఱపెట్టఁగా మిక్కిలి రుచ్యములగు పిండివంటలతో విందుభోజనమును పంపుటయేగాక లోకోత్తరసౌందర్యముకల కన్నియను పత్నిగాఁ గూడఁ గూర్చెను. అప్పటి విపత్తునకును, ఇప్పటి సంపత్తునకును

గూడ కారణ మా దేవదేవుఁడే గదా!" అని కుంటివాఁడు ఆనందవార్ధి నోలలాడుచుండెను.

వివాహముహూర్తము సమీపింపఁగా రాజు పెండ్లికుమార్తెను దీసికొని రావలె నని భటుల నాజ్ఞాపింపఁగా, వారు 'ఆమె ఎంత వెదకినను కనఁబడ లే'దని విన్నవించిరి. రాజు రాణిని మిగుల కోపించి, యామెయే రాజపుత్రికను దాచివేసెననియు, వెంటనే తీసికొని రావలె ననియు కఠినముగఁ బలికెను. తాను భద్రపఱచిన భత్యములగంప కానరాకుండుట కిదివఱకే ధాత్రి కలఁత పాటునొంది, సేవకుల నడిగి దాని నొక గరుడపక్షి యెత్తుకొని పోయెనని తెలిసికొని—తాను తన తెలివిలేమికతమున కుమారిన్ని పోఁగొట్టుకొంటినిగదా! యని మిగుల విచారించుచుండెను. అట్టియెడ రాజు పలికినమాట లామెకు మఱియు మనస్సునకు బాధ కలిగించి—తన తప్పును కప్పిపుచ్చుట కామె మిక్కిలి కోపమును నటించి, "మీ కుమార్తెసంగతి నా కేమి యెఱుక? ఇదివఱలో మీ రొకసారి—అమ్మాయి వివాహసంబంధమునుగూర్చి ప్రస్తావించునపుడు "నాకూఁతురువిషయమున నా యిష్టమువచ్చినట్లు ప్రవర్తింపఁగలవాఁడను; నన్ను కాదనుటకు నీ వెవ్వరవు?" అని పలికియుండిరి. అదిమొదలు నేను లోకమో, పాడో యనుకొని—అమ్మాయినిగూర్చి విచారింపనైనలేదు. అమ్మాయి యెక్కడ ఉండునదియును మీకును, మీ సేవకులకునుదప్ప యితరులకుఁ దెలియదని నా అభిప్రాయము. లోకములో ఆలని, మగఁడని ఏర్పడుటకుఁ గారణము-భార్యాభర్తలిరువురును కలిసి మెలసి, ఏకాభిప్రాయము కలిగి యుండవలెననియేకదా! మగఁడు తన భార్యను లెక్కచేయక తిరస్కరించినచో భర్తకు మే లెట్లు చేకూరును? అమ్మాయిసంగతి మీకు దెలియనిచో నా కెట్లు తెలియఁగలదు? అయ్యయ్యో! ఎండకన్నెఱుఁగని అమ్మాయి ఎక్కడ,

ఎట్టి కష్టములు పడుచున్నదోకదా !" అని పలికి, జాలి గలుగ విలపించెను. రాజుకూడ—ఏమియు బోధపడనందున—తల గోకి కొనుచుం బోయెను. సుముహూర్తము మించిపోయెను ప్రజ లందఱును పకపక నవ్వసాగిరి. రాజునకుఁ దలవంపులయ్యెను. సుశీలను వివాహమాడవచ్చిన ఇరువురు రాజపుత్రులును ముఖ ములు వెలవెలబాఱి, సిగ్గునఁ దలవంచుకొనుచు, తమతమ యిరవు లకుఁ బోయిరి.

వివాహార్థమై వచ్చిన రాజపుత్రులు వ్యర్థమనోరథులయి చెఱి యొక దిక్కునకుఁ బోవుచుండుటఁ గాంచి, నారాయణుఁడు బ్రహ్మను "ఓ విధాతా ! పెండ్లి కయి వచ్చిన యీ రాజపుత్రు లిద్దెవ్వరితోడను జెప్పక, మొగములను వ్రేలవేసికొని పోవుటకుఁ గారణమే"మని యడుగఁగా, నతఁడు "పరాత్పరా! నేను తొలుతనే చెప్పలేదా ? రాజపుత్రిక నీ భక్తుఁడగు నా కుంటివానిని జేరి, సుము హూర్తసమయముననే అతనిని వివాహమాడినది. వా రిరువురు నిప్పుడు సప్తసముద్రముల యావలియొడ్డున సుఖముగా నున్నారు. మఱి యీ రాజపుత్రు లిక్కడ నుండుట యెవరికొఱకు? అందుననే వారు తమతమ నిలయములకుఁ జల్లచల్లగ పోవుచున్నా"రని పలికి, వా రిరువురికి సంఘటన జరిగిన విధమును వివరించి చెప్పెను.

శంకర, నారాయణులు విరించిపలుకుల కచ్చెరువంది, యతని గొప్పతనముఁ గొనియాడిరి. వా రిరువురికిని ఆ దంపతులం జూడవలె నను కుతూహలము కలిగినది. బ్రహ్మయు వారితో వచ్చుట కంగీకరించెను. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ముప్వురును బ్రాహ్మణవేషములను ధరించి, యా దంపతు లున్న యెడకుఁ బోయి, వారి పరస్పరానురాగమును గాంచి సంతసించిరి. వారును వీరికి మిక్కిలి ప్రీతిపూర్వకముగను, సభక్తికముగను అతిథిపూజ లొన

రించిరి. వారి భక్తికి మెచ్చి, త్రిమూర్తులును తమ తమ రూపము లతో వారికిఁ బ్రత్యక్షమైరి. ఆ దంపతులు వీరిని వేనోళ్ల స్తుతించిరి. పిదప విష్ణుదేవుఁడు ఆ కుంటివానికిఁ గాళ్లొసంగుటయేగాక గొప్ప సంపదను బ్రసాదించెను. బ్రహ్మదేవుఁడు సుశీలకు చాల కాల మైదువతనంబు నొసంగెను. మహాదేవుం డా వరునకు గొప్ప జ్ఞానంబు నిచ్చెను. పిమ్మట హరియనుమతిని గరుడుఁ డా యిరువురిని సౌవీరనగరంబునకుఁ దెచ్చి విడిచెను. సుశీల తల్లిదండ్రులకుఁ దనపోయివచ్చిన తెఱంగును, కుంటివానిం బెండ్లాడిన విధమును, త్రిమూర్తుల ప్రత్యక్షమును, వరంబు లొసంగుటయు మున్నుగా సకలవృత్తాంతంబును తెలియఁజేసెను. ధాత్రీ, ధాతలు మిగుల సంతసించి, యల్లుని మిక్కిలి గౌరవించిరి. రాజు తన యల్లునికి దండనాయకపట్టంబు గట్టెను. ఆతండును ఇంద్రసేనానియగు సేనాని తెఱంగున మెలంగుచు సుఖంబున నుండెను.

నొసట వ్రాయఁబడిన వ్రాఁతను తప్పించుటకు హరి హరులకుఁగూడ సాధ్యము కాదు.

(భోజచరిత్రము)



# నచికేతుఁడు

యాగము లన్నింటను విశ్వజిద్యాగము గొప్పది; అసాధ్యమైనది కూడ. దాని నొనరించువారు తమ సొత్తు సంతటిని మనఃపూర్వకముగ యాచకులకు దానము చేయవలెను. తాను ధరించిన వస్త్రములనుతప్ప మఱి యే వస్తువును ఉంచుకొనరాదు. అట్టి మహాయజ్ఞము నొనర్చుట కొకప్పుడు వాజశ్రవసుఁడను ముని తల పెట్టెను. యాగము నెఱవేర్చుటకుఁగాను పెక్కుమంది ఆ మునికి కావలసినంత ధనమును, వస్తువులను, గోవులను ఇచ్చుచుండిరి. ముని యాగమును తలపెట్టెనే గాని యాతని హృదయము పరిపక్వము కాలేదు. ఆశ యనునది యాతని హృదయమున స్థిరనివాస మేర్పఱచుకొనియే యుండెను. యాగముపేరు చెప్పి సంపాదించిన యావులలో ఉత్తములగువానిని తన యేకైకపుత్రుఁడగు నచికేతునకు దాఁచియుంచుచుండెను. గడ్డి నమిలి మ్రింగ లేనివియు, నీరు త్రాగ లేనివియు, ఈనుటయు, పాలిచ్చుటయు లేనివియు నగు గోవులను—నిరుపయోగమైనవానినిమాత్రము వాజశ్రవసుఁడు దానము చేయుచుండెను.

నచికేతుఁ డుత్తముఁడు. అతనికిఁ జెడ్డతనమన్న గిట్టదు. తండ్రి చేయుచున్న యీ దానములు నిరర్థకము లనియు, వానివలన ఉత్తమగతులు కలుగకపోవుట యటుండ మహానరకము కూడ సంభవించు ననియు నాతఁడు తెలిసికొని, తండ్రి ప్రవర్తనకు మిగుల విచారించెను. అట్లు విచారించి తండ్రిచేయు నీ యకృత్యముల నాఁపుట కతఁ డొక యుపాయము పన్నెను. అదేమన—తండ్రి విలువైన వస్తువులను వెనుకకు ఉంచుట తనకొఱకే గదా! ఈ గొప్ప యవకాశమున తండ్రి తక్కిన వస్తువులతోఁబాటు

తన్నుకూడ ఇతరులకు దానము చేసినచో ఈ యకార్యము తప్పును. అతని నిష్కామతయు ఎల్లయెడల స్పష్టమగును. నచికేతుఁ డిట్లాలోచించి, తండ్రిం జూచి, "తండ్రీ ! నీ సర్వస్వమును అర్హులగు వారికి దానము చేయుచున్నావు. నన్నెవ్వరి కిత్తువో తెలుపుము. నేనును నీకు ప్రియమగు వస్తువులలోఁ జేరినవాఁడనే గదా !" అని ప్రశ్నించెను. తండ్రి సమాధాన మీయలేదు. నచికేతుఁడు మఱల నట్లే యడిగెను. అప్పుడును సమాధానము రాలేదు. కాని మూఁడవసారి యడిగినప్పుడుమాత్రము తండ్రి మిక్కిలి కోపించి "నిన్ను మృత్యుదేవత కీయఁదలఁచితిని" అని సమాధాన మిచ్చెను. తనకుఁ జీకాకు కలుగునట్లు నిర్బంధించి ప్రశ్నించుటచే వాజశ్రవసుఁడు విసిగి యిట్లు పలికియుండును.

తండ్రి యిట్లు పలుకఁగానే నచికేతుని గుండెలలో రాయి పడెను. మరణించుట యనిన ఎల్లరకును భయమే కదా ! "అక్కటా ! నాయనగారికి నాపై ఎంత నిర్దయ కలిగినది ? తమ పుత్రులు చెడ్డవారయి, వంశమున కపకీర్తిని తెచ్చునెడల అట్టి యధము లుండుటకన్న చచ్చుటయే మేలని పెద్దలు తలంచుట పరిపాటి. కాని నేను వంశమర్యాదకు కళంకము నాపాదించు కృత్యములను వేనినైనను చేయలేదే ! నేను ఉత్తముఁడ నని చాల మంది కొనియాడుచున్నారే ! ఒకవేళ అటులు కాకున్నను మధ్యముఁడ నయిన కావలెను ; అధముఁడ నెంతమాత్రమును కాను. ఇట్టి నన్ను చావఁ గోరుటకు కారణము బోధపడకున్నది.

నాకు మరణ మనిన వెఱపులేదు. నేను యముని యొద్దకు పోవుటకు సిద్ధముగనే యున్నాను. కాని నావలన ఆ యమునికగు ఉపకార మేమియో తెలియకున్నది. ఉత్తమగు వస్తువులవలన దానిని గ్రహించినవారి కేదయిన ప్రయోజన ముండవలెను గదా !"

నచికేతుఁ డిట్లు తలంచియు మరణించుటకు సంసిద్ధుఁడయి యుండెను. శాంతచిత్తుఁడైన తండ్రి దయతలఁచి తన్ను మృత్యు దేవత కీయకపోవునేమో యనియు, అట్లు చేసినచో నతని కసత్య వాదిత్వము కూడ కలుగుననియు నెంచి, తండ్రి యాశయమును స్థిరపఱచుచు నిట్లనెను:—"తండ్రీ! నీవు ఆడినమాట తప్పక, నన్ను మృత్యుదేవతయగు యమునిపాలికి తప్పక పంపుము. లేనియెడల నీకు అసత్యదోషము వాటిల్లును. మన వంశమున పూర్వు లెవ్వరును—అసత్యము పలికినవా రొక్కరును లేరు. మునుముందు కూడ ఎవ్వరును—మన వంశీయు లసత్యమాడరు. కావున నీవు నీ ప్రతిజ్ఞను నెఱవేర్చుకొనుము. నా మరణమునకు నీవు కొంచెమైనను విచారింపఁ బనిలేదు. సస్యము లెట్లు పుట్టి పెరిగి పెద్దవయి మరణించియు, తమ బీజములమూలమున మరల పుట్టుచున్నవో, ఆ విధమున నే మనుష్యులు మరణించినను, వారి యాత్మల మూలమున మఱల వేఱొక రూపమున పుట్టుచుందురు."

కుమారుఁ డిట్లు పలుకఁగా తండ్రి మఱి మాఱుమాట పలుకలేకపోయెను. నచికేతుఁడును వెంటనే ప్రయాణమయి మృత్యుదేవతయొద్దకుఁ బోయెను. ఇతఁడు యముని గృహమునకుఁ బోవుసరి కాతఁ డింట లేఁడు. కార్యాంతరమున నాతఁ డెచటికో పోయి, మూఁడు దినములవఱకును రాకుండెను. యముని గృహిణియు, తక్కుంగల కుటుంబమును అతిథియగు నచికేతుని పూజింప నవకాశము లేకపోయెను. ఏలయన—గృహయజమానుని యనుమతి లేకుండ, అతఁ డొనరింపవలసిన యతిథిపూజ నితరు లొనరింపరాదు. తిండి తిప్పలు లేక నచికేతుఁడు యముని యింటి యరుగుపై పరుండి మూఁడు దినములు గడపెను. పిదప యముఁ డింటికి వచ్చెను. ఇంటిలోనివా రాతనిఁ జూచి, "ఒక బాలుఁడు మీకొఱకు మూఁడు దినముల క్రిందటనే వచ్చి అరుగుపయి పస్తు

పండుకొని యున్నాఁడు. అతఁడు బ్రాహ్మణునివలె నున్నాఁడు. అట్టివాఁడు తిండిలేక గడపలో నుండినచో - గృహయజమానుని పుత్ర, మిత్ర, కళత్రాదులును, పాఁడిపంటలును, సమస్తైశ్వర్యములును నశించునని పెద్దలు చెప్పుదురు. ఈ యంశము మీకుఁ దెలియనిది కాదు'' అని విన్నవించిరి.

పిదప యముఁడు నచికేతునివద్దకు వచ్చి, యాతనివలన వృత్తాంతము నంతటిని దెలిసికొని, యాతని ధైర్య, సాహసములకును, పట్టుదలకును, సత్యవాక్పాలనమునకును, సచ్ఛీలమునకును మెచ్చుకొని, యతనిని చంపక, దీర్ఘాయుష్మంతునిగా నొనరించెను. అంతేకాక అతనిపయి, అతనితండ్రికి కోపము లేకుండునట్లు చేసెను. మఱియు కావలసిన వరములను కోరవలెనని యముఁడు నచికేతు నడిగెను. దాని కతఁడు తనకు ఆత్మస్వరూపమును తెలుపవలెనని ప్రార్థించెను. దేవతలుకూడ ఆత్మస్వరూపమును తెలిసికొనఁజాలక తన్ను ప్రార్థించిరనియు, తాను వారికిని జెప్పలేదనియు, ఆత్మస్వరూపము దురవగాహమనియు యముఁడు పలికెను. కాని నచికేతుఁడు యముని విడువక తన కా విషయమునఁ గల యాసక్తిని వివరించెను. ఆ పిదప యముఁ డాతనికి ఆత్మస్వరూపమును బోధించెను. నచికేతుఁడు తృప్తుఁడయి తన యాశ్రమమునకుఁ బోయెను.

సత్ప్రవర్తన గలవాని కెచ్చటనైనను జయము కలుగును. ఆపదలు తప్పిపోవును.

(కఠోపనిషత్తు).

# వాసవదత్త

మున్ను కౌశాంబీ నగరము రాజధానిగా వత్సదేశమును ఉదయనుఁడను రాజు పరిపాలించుచుండెను. అతఁడు సకలకళా ప్రవీణుఁడు: విద్య లన్నింటను దిట్ట. అందును సంగీతమనిన అతఁడు చెవికోసికొనును. గాంధర్వవిద్యయం దపారపాండిత్యమును సంపాదించి, వీణను పలికించుటలో అంతటివాఁడు మఱి జగత్తులో లేఁడని పేరుపొందెను. అతని వీణయగు ఘోషవతి నారదుని వీణయగు మహతితో సమానమయినది. అతఁడు వేఁటకయి యడవికిఁ బోయినపుడు తనతో వీణనుకూడఁ దీసికొనిపోయి, దానిని వాయించి యడవియేనుఁగులనుకూడ అవలీలగఁ బట్టుచుండెను.

ఆ రాజు సన్నిధిని అన్ని విధముల అనుకూలుఁడగు యౌగంధరాయణుఁ డను మంత్రిసత్తముఁ డుండెను. అతఁ డఘటనఘటనా సమర్థుఁడు; ప్రభుభక్తిపరాయణుఁడు. అతనియుక్తికి తిరుగు లేదు. ఈ యంశములను బాగుగ నెఱుఁగుటచేతనే ఉదయనుఁడు రాజ్యభారమును సర్వము నతనిపయినే యుంచి, సచివాయత్తుఁడయి, ఎట్టి చీఁకుచింతలును లేక హాయిగా కాలము గడపుచుండెను.

అవంతి దేశము వత్సదేశమునకు పొరుగుదేశము. ఉజ్జయినీ నగరమును రాజధానిగాఁ జేసికొని, ప్రద్యోతుఁడను రాజు ఆ రాజ్యమును పాలించుచుండెను. ఇరుగుపొరుగుల రాజులకు సహజవైర ముండుటయు, వీలుచూచుకొని ఒకరి రాజ్యమును నింకొకరు కబళింపఁ గోరుటయు సహజము. ఆ సంప్రదాయము ఉదయన, ప్రద్యోతులయెడను పనిచేసినది. వత్సరాజు విద్వాంసుఁడగుటను, రాజ్యవ్యవహారములయెడ జోక్యమును కలుగఁజేసికొనకుండుట చేతను, అతనికిఁ బ్రద్యోతునిపయి పగ లేదు. కాని—అసూయా

వరుఁడగు ప్రద్యోతునికిమాత్రము వత్సరాజునెడ ఎక్కువ ద్వేష ముండెను. ఉదయనునికి యౌగంధరాయణునివలె—ప్రద్యోతు నకుఁగూడ శాలంకాయనుండు ప్రధానామాత్యుఁడయి రాజ్య చక్రమును త్రిప్పుచుండెను. అతఁ డన్నివిధములను యౌగంధ రాయణునకు సాటి యనవచ్చును.

ప్రద్యోతునకు ఒక పుత్రిక కలదు. ఆమె పేరు వాసవదత్త. ఆ కాలమున నుండిన అందకత్తెలలో ఆమెయే మిన్న యని అంద ఱును చెప్పుచుండిరి. చక్కఁదనముతోఁబాటు సరస్వతీకటాక్షమును ఆమె కబ్బినది. యుక్తవయస్సు రా వేగమే తండ్రి యామెను తగిన వరుని కిచ్చి వివాహ మొనర్పవలె నని మిగుల కుతూహల పడుచుండెను. కాని ఎంత వెదకినను ఆమెకు తగిన వరుఁడు లభింప కుండెను. ఉదయనుఁ డొక్కఁడే ఆమె కన్నివిధముల ననురూపుఁడు. కాని అతనిపేరు వినినమాత్రముననే మండిపడు ప్రద్యోతుఁడు దాని కియ్యకొనునా ? ఎన్ని సంబంధములనో పరిశీలించి విసిగి, వేసారి, ప్రద్యోతుఁడు తుదకు జ్యోతిష్కులను రావించి, వాసవదత్త భావిస్థితిని స్పష్టముగఁ దెలుపఁగోరెను. వారును బాగుగ పరిశీ లించి, యామె గొప్ప యదృష్టవంతురాలగుననియు, ఆమెకు ఉదయ నుఁడు తప్ప వే ఱొకఁడు భర్త కాఁజాలఁడనియు తెల్పిరి. ఆ మాట లను వినిన ప్రద్యోతునకుఁ గాలుసేతు లాడకపోయెను. తన పుత్రి కను ఉదయనున కిచ్చుట తప్పనిసరి యయినది. విధి నతిక్ర మించుట వరికిని సాధ్యము కాదని అతనికి దెలియును. కాని తనంత తాను ఉదయను నాహ్వానించి, యతనికి వాసవదత్త నిచ్చుట యసంభవము. పోనీ వాసవదత్త యందచందములను తెలిసికొని, అవివాహితుఁడైన వత్సరాజు తనకుఁ గన్య నీయవలెనని ప్రద్యో తునకు వర్తమాన మంపునా ? అది అంతకంటెను అసంభవము. ఇట్లుభయులు నుపేక్షించినచో—వాసవదత్త అవివాహితయై

యుండిపోవుట తప్ప వేఱు ప్రయోజనము కనఁబడదు. అందువలన ప్రద్యోతుఁడు తన ప్రధానామాత్యుఁడగు శాలంకాయనునితో ఆలోచించి కపటోపాయమున ఉదయనుని ఉజ్జయినికి రప్పించి, అతనిచే వాసవదత్తకు సంగీతము నేర్పించు నెపమున ఆమెపయి ననురాగము పుట్టించి, ఉదయనుఁడే కోరి యామెను వివాహ మాడునట్లుచేయఁ బన్నుగడలను పన్నెను.

వత్సరాజునకు వేఁటయం దాసక్తి మెండనియు, వేఁట సమయమున తన ఘోషవతిని వాయించి, వన్యగజములను స్వాధీనము చేసికొనఁగలఁడనియు శాలంకాయనునకుఁ దెలియును. కావున అతఁడు యంత్రగజము నొకదానిని నిర్మించి, దానిని వీరులతో నింపి, వత్సరాజు తఱచుగ వేఁటకువచ్చు వనమునం దొకచో నిలిపెను. ఉదయనుఁడు మామూలురీతిని వేఁటాడిన పిదప, శాలంకాయననియుక్తుఁడగు సేవకుఁ డొకఁడు వత్సరాజభటవేషమును ధరించి, తమయేలికకు ఆ గజము వృత్తాంతమును తెలిపెను. ఏనుఁగును వేఁటాడుటయం దెక్కువ మక్కువ కల ఉదయనుఁడు తోడనే తన ఘోషవతితోడ బయలుదేఱి, యా సేవకుఁడు చూపిన మార్గమున వచ్చి, యా యంత్రగజమును దూరమునుండియే చూచి, అది యథార్థమగు గజమే యను భ్రాంతితో ఘోషవతిని చేతఁ బుచ్చుకొని మీటసాగెను. ఆ యేనుఁగు తన వైపునకు వచ్చుటకు బదులు వెనుకకు తగ్గుచుండుటకు వింతపడి రాజు దానిని విడువక తాను ముందు పోసాగెను. అతఁడు ముందునకు వచ్చుచున్న కొలంది గజము వెనుకకుఁ బోవుచుండెను. ఇట్లు కొన్ని గడియలు గడచెను. ఉదయనుఁడు తన సేనకు మిక్కిలి దూరమయ్యెను. అతఁడు తన దేశపు సరిహద్దును దాటి, అవంతిదేశమునఁ బ్రవేశించెను. ఇది యాతనికిఁ దెలియనే లేదు.

వత్సరాజు నిస్సహాయుఁడయి యున్న సంగతి నెఱింగి యంత్ర గజమునం దున్న వీరులు బయటికి వచ్చి ఆతనిని బంధించిరి. రాజు నకు గజవృత్తాంతమును దెలియంజేసిన భటుఁ డంతకుఁ బూర్వమే మాయమయ్యెను. ఇది యంతయును శత్రువులు పన్నిన పన్నాగ మని యుదయనున కప్పటికిఁ దెలిసెను. కాని యేమి ప్రయోజ నము? గతజలసేతుబంధనమునుగూర్చి కలఁతపడుట యేల? అతఁడు చేయునది లేక శత్రువులకు వశమయి వారివెంట ఉజ్జయి నికిఁ బోయెను. ఉదయనుఁడు రప్పింపఁబడె నని తెలిసి, ప్రద్యోతుఁడు ఆనందమున ఆకసము నంటెను. అతఁడు వత్సరాజును మిక్కిలి గౌర వించి, సమస్తసౌకర్యములతోడను గూడిన ఒక చక్కని సౌధ మున నాతనిని విడియించెను. వందలకొలఁది దాస, దాసీజనములు వత్సరాజు నాజ్ఞానువర్తులగునట్లు ప్రద్యోతుఁడు ఆజ్ఞాపించెను. అవంతీశ్వరుఁడు తన్ను మోసగించి తెచ్చినందులకు ఉదయనునకు మిగుల కోపము కలిగినను, అతఁడు చూపుచున్న గౌరవమునుబట్టి అయ్యది వెంటనే చల్లారిపోయెను.

వినయవిధేయతలతో ప్రద్యోతుని మంత్రి యొకఁడు ఉద యనున కిట్లు మనవి చేసెను:—"చండమహాసేనబిరుదాంచితులగు మా ప్రద్యోతప్రభువులకు ఏలినవారిని నిర్బంధింపవలెనని గాని, అవమానింపవలెననిగాని అభిప్రాయ మొంతమాత్రమును లేదు. మా ప్రభుపుత్రిక యగు వాసవదత్తాదేవికి సర్వకళలయందును ప్రావీణ్యము కుదిరినది; కాని గానకళయందు కొంత కొఱత కలదు. గాంధర్వవిద్యలో నిష్ణాతలు తమరే కాని వేరొకరీ భూమండల మున లేరనుట అతిశయోక్తి కాదు. కావున తమ శుశ్రూషా భాగ్య మందిననే యామెకు గానవిద్య పూర్తియగు నని తలఁచి, తమ్ము రప్పించుటకు ఉపాయాంతరము తోఁచక, మా ప్రభువు ఈ యుక్తిని పన్నెను. ప్రభువు లన్యథా తలంపకుందురు గాక! మా

ప్రభువులుకూడ కొన్ని గడియలలో తమ దర్శనమునకు రాఁగలరు. తాము దయచేసి, వారి కోరికను తిరస్కరింపక వాసవదత్తాదేవి శుశ్రూషను గ్రహించి, యామెకు గాంధర్వవిద్యాపాండిత్యము ననుగ్రహింతురుగాక ! యని మా ప్రార్థనము.”

ఉదారహృదయుఁడగు నుదయనుఁ డందుల కియ్యకొనెను. మరునాఁడు మంచి దిన మగుటచే ప్రద్యోతుఁడు వాసవదత్తను వత్సరాజువశ మొనరించి, యామెను గానకళానిపుణం జేయవలెనని ప్రార్థించెను. క్రమక్రమముగా వాసవదత్త గాంధర్వవిద్యయం దపారమగు పాండిత్యమును సంపాదించుటయేగాక, ఉదయనుని ప్రేమించి, యాతని ప్రేమను చూరగొనుటయందును నేర్పును సంపాదించెను. ఇట్లుదయనునకు ఉజ్జయినీనగరమున పేరునకు నిర్బంధమేగాని యెట్టి కష్టములును లేకుండెను. వత్సరా జచట సుఖముగఁ గాలము గడపుచుండెను.

ఇఁక వత్సదేశవృత్తాంతమును గమనింతము. వేఁటకుఁ బోయిన రాజు మఱలి రాకుండుటయు, సైన్యమే మఱలి వచ్చుటయుఁ గాంచి, యౌగంధరాయణుఁడు మిగుల దిగులొందెను: రాజు ఎటు పోయినదియుఁ దమకుఁ దెలియ దనియు, ఒక రాజభటుఁడు మాత్రము రహస్యముగ మహారాజుతో నేమియో సంభాషించి, వీణతోఁగూడ నతనిని గొంపోయె ననియు, తాము రెండు మూఁడు దినములపాటు అడవు లన్నియు గాలించి వెదకినను వారి జాడ ఏమియు తెలియలే దనియుఁ, జేయునదిలేక తాము వెనుకకు రావలసివచ్చిన దనియు సైనికులు తెలిపిరి. ఇం దేదో మోస మున్న దనియు, అది ప్రద్యోతుని పని యయి యుండవచ్చు ననియు మహామంత్రి యూహించెను. అతనియూహకుఁ దగినట్లుగానే ఉజ్జయినీ నగరమునుండి వచ్చిన చారుఁ డొకఁడు యావద్వృత్తాంతమును

పూసగ్రుచ్చినట్లు ఆతనికి మనవిచేసెను. ఈ సంగతి వెంటనే అంతఃపురమువఱకు ప్రాకెను. వృద్ధయగు రాజమాత తన పుత్రుఁడు శత్రువులకుఁ జిక్కెనని తెలిసి తల్లడిల్లి, "పుత్రభిక్ష పెట్టి జీవములు నిలుపవలె" నని యౌగంధరాయణునకు వర్తమాన మంపెను. "నెలదినములలోపల నీ పుత్రునిఁ దెచ్చుటయే గాక, శత్రువులకుఁ దగిన ప్రాయశ్చిత్త మొనర్తును. అట్లు చేయలేనిచో నేను యౌగంధరాయణుఁడనే కాను. ఇది నా ప్రతిజ్ఞ." అని మహామంత్రి రాజమాతకుఁ బ్రత్యుత్తర మంపి, ఉదయనుని విడిపించి తెచ్చుటకు అనువగు నుపాయముల నాలోచింపసాగెను.

యౌగంధరాయణుఁడు పన్నిన పన్నుగడ ననుసరించి యాతఁడు పిచ్చివాని వేషమును ధరించెను; సేనాధిపతి యగు రుమణ్వంతుఁడు క్షపణకసన్న్యాసివేషము నూనెను; ఉదయనుని వేడుకచెలికాఁడగు వసంతకుఁడు విదూషకుని వేషము దాల్చెను. మహామంత్రి రాజ్యపాలనమునకుఁ దగిన కట్టుదిట్టములు చేసి, తన మిత్రు లిరువురితోఁ గూడి ఉజ్జయినీనగరమునకుఁ బోయెను.

యౌగంధరాయణుఁడు పిచ్చివాఁ డయి ప్రద్యోతునియొద్ద నుద్యోగము చేయుదు ననియు, అవంతీదేశమును కొందు ననియు, ఉదయనుని విడిపించుకొనిపోవుదు ననియు, యౌగంధరాయణుని మించిన బుద్ధిమంతుఁడ ననియు, ఏమేమో నోటికి వచ్చినట్లెల్ల అఱచుచు, వీథులవెంబడి తిరుగుచు, జనులకును, అందును బాలురకును వినోదమును కలిగించుచుండెను. రుమణ్వంతుఁడు బౌద్ధసన్న్యాసి వేషమున బౌద్ధధర్మములను బోధించుచు, బౌద్ధవిహారములందుఁ బండుకొనుచు కాలము గడపుచుండెను.

వసంతకుఁడు విదూషకవేషమును ధరించి, దినమున కొక వేసము చొప్పున మార్చుచు, తన వికారపు చేష్టలవలనను, సంభాష

ణులవలనను జనులయొక్కయు, అందును స్త్రీలయొక్కయు హృదయములను జూచుకొనుచుండెను. అతని వృత్తాంతము క్రమక్రమముగ ప్రద్యోతునకును తెలిసెను. అతఁడు విదూషకుని వాసవదత్తయొక్కయు, వత్సరాజుయొక్కయు వేడుకకొఱకు—మంచి కథలను చెప్పి, మనస్సును రంజింపఁజేయుటకు వారివద్దకుఁ బంపెను. ఆ వచ్చినవాఁడు వసంతకుఁ డనియు, తన్ను విడిపించు ప్రయత్నమున వచ్చినాఁ డనియు ఉదయనుఁడు గ్రహించి, అతని కథలకు సంతసించినవాఁడుపోలె ప్రతిదినమును తమవద్దకు వచ్చుచు పోవుచుండవలెనని కోరెను. తమ ప్రయత్నముల కిది యెంతయు ననుకూలమగుట వసంతకుఁడును ప్రతిదినమును వచ్చుచు, కొంతదనుక ఉదయనునితో సంభాషించుచుండెను. ప్రద్యోతుని యాజ్ఞయగుటచే ఎచటికిఁ బోయినను - అతని నడ్డుకొనువారు లేకుండిరి.

వారు ముప్పురును ఇట్లు పగలంతయును నగరమునఁ దిరుగుచు, విశేషములను గ్రహించుచు, తమ రాజును విడిపించుటకుఁ దగు నుపాయములను పన్నుచు, నడిరేయి యొక్కచోఁ గూడుచు, తా మెఱిఁగిన విశేషములను పరస్పరము ఎఱిఁగించుకొనుచు, చర్చించుచుండిరి.

శాలంకాయనప్రభృతులగు ప్రద్యోతుని మంత్రులు వత్సరాజును పట్టి తెచ్చుటతోడనే తమ పని నెఱవేఱినదని నిర్విచారముగ నుండిరి. యౌగంధరాయణుని ప్రయత్నములను కొంచెమైనను వారు కనిపెట్టలేకపోయిరి.

యౌగంధరాయణుఁడును, రుమణ్వంతుఁడును, వసంతకుఁడును తమ తమ కనిపెట్టిన విషయములను చర్చించుచు, పరిపరి విధముల నాలోచింపసాగిరి. మహామంత్రి యొకనాఁడు దీక్షతో

నాలోచించి, యొక నిశ్చయమునకు వచ్చి, తన యభిప్రాయమును మిత్రుల కిట్లు తెలియఁజేసెను :—

"ప్రద్యోతునకు నడాగిరి యను పేరిటి పట్టపుటేనుఁగు కలదు. దానిపయి రాజునకు మక్కువ యెక్కువ. నేను దాని మావటీనికి లక్షరూప్యములు లంచ మిచ్చి, జేపటిదినమున వానిచే దానికి పిచ్చిమందు పెట్టించి, యా గజము వెఱ్ఱియెత్తి నగరము నల్లకల్లోలము చేయునట్లు ఒనరించెదను. ప్రజలు దానిబాధలు పడలేక రాజుతో మొఱపెట్టుకొందురు. ఆతఁడు చేయునది లేక మన మహారాజును చెఱ విడిపించి, 'యెట్లయినను ఈ యేనుఁగును లొంగఁదీసికొని, నన్నును, నా ప్రజలను కాపాడవలయు'నని కాళ్ల వ్రేళ్లఁ బడి ప్రార్థించును. సహజదయాస్వభావుఁడగు మన యేలిక 'వల్లె' అని ఘోషవతిని తీసికొని, దాని సాయమున నా యేనుఁగును లొంగఁదీసికొని, దాని నధిష్ఠించును. అపుడు మనము మన రాజు నా గజముతోడనే మన నగరమునకుఁ దీసికొనిపోవచ్చును. మన ప్రభువు నీ యూరినుండి తప్పించినపిదప ఎట్టి కష్టమునయిన నెదుర్కొనవచ్చును. ఇదివఱకే మనవారు చాలమంది మాఱు వేసములతో వచ్చి యిచట కాఁపుర మున్నారను సంగతి మీకుఁ దెలియును ఇదివఱకే కొంత సైన్యమును ఈ నగరమునకుఁ గొలఁదిదూరములో రహస్యముగ నుంచి యున్నాను. రాజు తప్పించుకొన్నపిదప యుద్ధము తటస్థించినచో దాని నెదుర్కొనుటకే ఈ యేర్పాటులు చేయఁబడినవి. ప్రద్యోతుఁడు మన ప్రభువును మాయాగజముకారణమున మోసగించి, చెఱ నుంచినాఁడు. మనము యథార్థగజముకారణముననే మన యేలికను విడిపించి, ప్రద్యోతుని కన్నులలో దుమ్ముకొట్టి పోవలెనుగదా!"

ఈ యుపాయము రుమణ్వంతునికిని, వసంతకునికిని నచ్చినది. కాని వసంతకునకు ఒక సందేహము మాత్రము కలదు. తమప్రభువు ప్రవర్తనమును జూడ నతఁడు వాసవదత్తను విడిచి యొక నిముసమయినను ఉండఁగలిగినట్లు లేదు. ఇది గమనించి యతఁడు "మహామంత్రి తలఁచిన యుక్తి అత్యద్భుతము. ఈ యుక్తివల్ల మన ప్రభువును సులభముగా విడిపింపనగును. కాని వాసవదత్తనుండి విడిపించుట అసాధ్యము. అతనికి ఆమెతోడిదే లోకము కదా !" అని పలికెను. యౌగంధరాయణుఁడు దీర్ఘముగ నాలోచించి, తల పంకించి, "సరియే ! దానికిని తగిన యుపాయమున్నది. వాసవదత్తాదేవికరమును గ్రహింపఁజేయుటకుఁగదా చండమహాసేనుఁడీ మోసము నంతటిని పన్నుట! ఆతనియుద్దేశము పూర్తిగ నెఱవేఱకుండఁగనే—ఆమెతోఁగూడ మన ప్రభువును ఈ యూరు వెడలింతము. ఇట్లు చేసినయెడల ప్రద్యోతుని వంచనకు ప్రతివంచన సర్వవిధములఁ జేసినట్లగును. నా యాలోచనమును వినుఁడు. తొలుతఁ జెప్పినట్లు నడగిరికి పిచ్చెత్తించుటయు, రాజును చెఱనుండి విడిపించి, అతనిమూలమున దానిని శాంతపఱచుటయు అవశ్యముగాఁ జేయఁదగిన పనులు. ఉదయనుఁ డొనరించిన యీ మహోపకారమునకు ఎక్కువ సంతసించి, ప్రద్యోతుఁ డాతనిని మఱల నిర్బంధమునం దుంచుట భావ్యము కాదని కొంత స్వేచ్ఛ యొసఁగును. మన ప్రభువును నమ్మకము కలుగునట్లే ప్రవర్తింపవలయును. అతఁడు వాసవదత్తాదేవికి నచ్చఁజెప్పి, యామె ఆతనితోఁ గూడఁ గౌశాంబికి—రహస్యముగఁ ప్రయాణమగుటకు సిద్ధముగ నుండునట్లు చేయవలెను. ఆమె తప్పక మన ప్రభువుతో రాఁగలదని నా నమ్మకము. ఆమెకుఁ దండ్రి భద్రవతి యను నొక పిడియేనుఁగు నిచ్చియున్నాఁడు. అది మిక్కిలి వేగము గలది. దానిని వెంబడించుటకు ఒక్క నడగిరికేఁ దక్కవే యొక్క గజమునకు శక్తి

లేదు. నడగిరి ఆ పిడియేనుఁగును జూచినమాత్రమున వెనుకకు జంకునుగాని ఎదిరింపదు. నేను దాని మావటీనికి లంచమిచ్చి, ఒక నాఁటి నడురాత్రి అది మన ప్రభువును, వాసవదత్తాదేవితోఁ గూడఁ దీసికొనిపోవుటకు సిద్ధముగ నుండునట్లు ఏర్పాటుచేసెదను." అని పలికెను. ఈ యాలోచన ఉచితముగ నున్నదని చివఱకు ముగ్గురును నిశ్చయించుకొనిరి.

పిదప యౌగంధరాయణుఁడు తన కృత్యముల నన్నింటిని నిర్విఘ్నముగ నెఱవేర్పసాగెను. పిచ్చెత్తిన నడగిరిని సాంత్వనపఱచుటకు ఉదయనుని చండమహాసేనుఁడగు ప్రద్యోతుఁడు ప్రార్థించెను. వత్సరాజు గజమును ఘోషవతీసాహాయ్యమున లొంగఁదీసికొనెను. అతఁడు చేసిన యీ మహోపకారమునకుఁ గృతజ్ఞతఁ జూపుచు, అవంతీశ్వరుఁ డాతనికిఁ గొంత స్వేచ్ఛ నొసంగి, నగరమును మాత్రము దాటిపోకుండునట్లు తగిన కట్టుదిట్టముల నొనర్చెను. వత్సరాజును ప్రద్యోతునికి నమ్మకము గలుగునట్లే ప్రవర్తించెను. మఱియొకనాఁడు మహామంత్రి లంచమిచ్చి భద్రవతి మావటీఁడగు ఆషాఢకుని లొంగఁదీసికొని, ఆ రేయి ఆ యేనుఁగును వాసవదత్తయంతిపురముకడ సిద్ధముగ నుండునట్లు ఏర్పఱిచెను. నడిరేయి దాని నధిష్ఠించి వత్సరాజును, వాసవదత్తయును నగరము వెలువడిరి. అంతకుముందే ఆయుధహస్తులయి సిద్ధముగ నున్న వత్సరాజసైనికులు కొందఱు కావలివారిని సంహరించి, మార్గమును నిష్కంటకము నొనర్చిరి. ఈ సంగతి నెఱింగి, శాలంకాయనాది మంత్రివర్గము సేనలతో రాజును వెంటాడ సిద్ధపడిరి. కాని వత్సరాజసైన్యము వారి నెదిరించి, యా ప్రయత్నమును కొనసాగనీయలేదు. త మ్మెదిరించినవారిలో—ఉజ్జయినియందుఁ దిరుగుచుండిన పిచ్చివాఁడుకూడ ఉండుటకు ఆశ్చర్యపడి, అవంతిసైనికులు చాలమంది ఆతనిపయిఁబడి, యాతని కత్తిని తుత్తునియలుచేసి, ఆతనిని

బంధించి, రాజునెదుట నుంచిరి. రా జా యున్నత్తుని అతని వృత్తాం తము నడుగఁగా—యౌగంధరాయణుఁడు తన వృత్తాంతమును, తాను ఉజ్జయినికి వచ్చిన పనిని, తాను దానిని నేర్పుతో నెఱ వేర్చినవిధమును వివరించి తెలిపి, "ప్రద్యోతునిమంత్రుల తెలివి తేఁటలు మిక్కిలి ప్రశంసింపఁదగినవి ! మే మిచట మా మా ప్రయ త్నములలో నుండఁగా హాయిగా నిద్రపోయిరి. ఉదయనసార్వ భౌముని తెచ్చుటతోడనే తమప్రతిభ ప్రకటితమైనదని తలఁచిరి. యౌగంధరాయణుఁడు తమగుండెలలో నిద్రపోవునని, పాపము ! వారికిఁ దెలియకపోయెను. ఇపుడు వత్సరాజు తన ప్రేయసితోఁ గూడ—జను లందఱును చూచుచుండఁగా యథార్థమైన ఏనుఁగు నెక్కి పాఱిపోవుచుండఁగా—చేతులు నులుముకొనుచు ఒకరి మొగ మొకరు చూచుకొనుచు—మూలనున్న ముసలిదానిని కొట్టి నట్లు—పిచ్చివాని నొక్కనిఁ బట్టి రాజునెదుట నుంచిరి. నిజముగా ప్రభువుల కిట్టి మంత్రుల యాలోచనమే అవశ్యాదరణీయము." అని పలికెను. ఈ మాటలు విని, అందఱును ముక్కుపయి వ్రేలు వేసికొనిరి. శాలంకాయనప్రభృతులు మాడిన మోములతో తలలు వంచుకొనిరి. యౌగంధరాయణుని యుక్తిని, ప్రతిభావిశే షమును ప్రద్యోతుఁడు బహుముఖములఁ గొనియాడెను. అట్టి మహానుభావుని బంధించుట కాని, వత్సరాజునేన నెదుర్కొనుట కాని, వత్సరాజును వెంబడించుటకాని నిష్ప్రయోజనము లనియు, అపాయకరము లనియు, తమ తెలివితక్కువతనమును వెల్లడించు ననియు నెఱింగి, ప్రద్యోతుఁ డా మహామంత్రిని బహువిధముల సత్కరించి, ఉదయనునియెడఁ దనకుఁ గల గౌరవాదరములను, అతనిని మోసగించి తెచ్చుటలోని అభిప్రాయమును అతనికి వివ రించి తెలిపెను. పిదప నాతనియెదుటనే ఉదయన, వాసవదత్తల చిత్రములకుఁ బెండ్లి చేయించి, లెక్క లేని కానుకలను వధూవరు

లకుఁ గౌశాంబీనగరమునకుఁ బంపెను. యౌగంధరాయణుఁడును కృతకృత్యుఁడయి, ప్రద్యోతునిచే సబహుమానముగ వీడుకొలుపఁబడి కౌశాంబిని చేరెను. ఉదయనుఁడు వాసవదత్తతోఁగూడ సుఖము లనుభవించుచు పెక్కేండ్లు రాజ్య మేలెను.

ధీమంతులు తమ కార్యములు నెఱవేఱుట కెట్టి కష్టముల నయినను అనుభవించుటకు వెనుదీయరు.

(ప్రతిజ్ఞాయౌగంధరాయణము - నాటకము)

---

# భారవి

భారవి యనునతఁ డొక గొప్పకవి. అతఁడు సంస్కృత మున కిరాతార్జునీయ మను మహాకావ్యమును రచించెను. అతఁ డన్ని శాస్త్రములయందును గొప్ప పండితుఁడు; మహాప్రతిభా శాలి. అతని బాల్యమునకు సంబంధించిన వృత్తాంతము మిక్కిలి వింతదైనది.

అక్షరాభ్యాసమయినదిమొద లాతఁడు గొప్ప తెలివిగల వాఁడని పేరుపడెను. సాటి విద్యార్థులలో మేటియని ఎన్నిక గనెను. వేలుచూపిన మండ మ్రింగు పద్ధతి యతనిది. అతఁ డడిగిన ప్రశ్నలకు గురువులుకూడ తగిన ప్రత్యుత్తరముల నీయఁ జాలకుండిరి. అతనికి పుట్టుకతోడనే కవిత్వ మబ్బియుండును; లేనిచో చిన్నతనమునందే గొప్పగా కవిత్వము చెప్పుట దుర్ఘటము. అతనింజూచినపుడెల్ల ప్రజలు మిగులఁ ప్రశంసించు చుండిరి. అట్టి పొగడ్తల కతఁడు లోలోపల సంతసించుచున్నను బయటికి ఆ యానందమును తెలుపక, గర్వము పొందక, తన విద్యావ్యాసంగమును కొనసాగించుచుండెను.

భారవి తండ్రియు గొప్ప విద్వాంసుఁడు. కుమారుఁ డతనిని మించి యుండెను. కావున జనులు భారవిజనకుని జూచినపుడెల్ల భారవిని ప్రశంసించుచు, అతఁడు తండ్రిని మించినవాఁడనియు, "పండితపుత్రః శుంఠః" అను నానుడిని తుడిచివేసినవాఁ డనియుఁ గొనియాడసాగిరి. కుమారుని యభ్యున్నతినిగోరు తండ్రి ఎన్నఁ డును అట్టి పొగడ్తల నంగీకరింపఁడు. కావున నాతఁడు తన కుమా రుని కొలఁదిపాటిజ్ఞానమునకు పెద్దల దీవనలే కారణ మనియు, అతఁడు గొప్ప విద్వాంసుఁడని కొనియాడుట తగ దనియు,

అతఁడు నేర్వఁదగిన యంశము లింకను ఎన్నియేని కల వనియు జనులకుఁ జెప్పుచుండెను. వా రాతనిమాటల కాశ్చర్యపడసాగిరి. అనేకు లనేకవిధముల విమర్శింపసాగిరి. తండ్రికొడుకులకు సరిపడ దని కొందఱును, తండ్రికి కుమారునిపయి అసూయ మెం డని కొంద ఱును ఎవరికిఁ దోఁచినట్లు వారు ఏమేమో చెప్పసాగిరి.

తండ్రి యాడుచున్న మాటలను మిత్రులు భారవికిఁ దెలి యఁజేసిరి. తన తండ్రికి తనయెడఁ గల ఈ అనాదరమునకు అతఁడు మిగుల చింతించెను. వీలగునంతవఱకును తండ్రిముఖ మును చూడక - అతని దృష్టిపథమును తప్పించుకొనుచుండెను. తల్లికిఁగూడ నొకటి రెండు సారులు తన్ను జనులు ప్రశంసించు విధమును, తండ్రి తనయెడఁ జూపు ననాదరమును, అసత్ప్రచార మును తెలిపెను. ఆమెయు మనస్సున నొచ్చుకొని, ఆ విషయ మున భర్తను మందలించుటకుఁ దగిన యదను వేచియుండెను.

భారవి పండితుఁడే యైనను అనుభవము అతనికిఁ జాల తక్కువ. అతఁ డింకను బాలుఁ డగుటయే దానికిఁ గారణము. తండ్రి తన్నుగూర్చి ఏల ఇట్లు చెప్పుచున్నాఁడో అతఁడు గ్రహిం పక ఒకనాఁటి సాయంకాలమున ఒక పెద్దఱాయి తీసికొని, ఇంట నెవ్వరికిని దెలియకుండ వంటయింటియటుకపై నెక్కి కూరుచుండి యుండెను. తండ్రి భుజించుచున్న సమయమున ఆ ఱాతి నాతని తలపై నెత్తి, శిరస్సు పగులఁగొట్టి చంపవలయునని ఆతని తలఁపు. ఇట్లు చేసిన తన్ను మాటిమాటికిని నలుగురు పెద్దమను ష్యులలోను అవమానించుచున్న యాతనికిఁ దగిన ప్రాయశ్చిత్తము జరుగునని భారవి యూహించెను.

రాత్రి యెనిమిది గంటల సమయమున అతని తండ్రి భోజన మునకు వచ్చెను. ప్రతిదినము భారవితల్లి తండ్రి, కుమారు లిద్దఱి

కిని ఒక్క సారియే భోజనము పెట్టెడిది. నేఁడు ఒక్కరికే విస్తరి వేయుట చూచి తండ్రి యాశ్చర్యపడి, "అబ్బాయి ఎక్కడ?" అని యడిగెను. భారవి యభిప్రాయ మింకను తండ్రికిఁ దెలియనే లేదు; తల్లియు నంతవఱకును చెప్పలేదు. అదియే యదనని తలఁచి "ఏమో! సాయంకాలమునుండియు కనఁబడకున్నాఁడు. అయినను కొన్నిదినములనుండియు వాని మనసు ఏమియు బాగుగ నున్నట్లు లేదు. మనస్సులో ఏమో చాల కలఁతపడుచున్నట్లు తోఁచు చున్నది" అని యామె పలికెను. అన్నపుకడి నోటిలో పెట్టుకొను చున్న భారవితండ్రి "దానికిఁ గారణ మేమి?" అను ప్రశ్నను సూచించుచు భార్యవైపు చూచెను. ఆమె కొంచెము సంకోచించుచు "మనవాఁడు మంచి తెలివిగలవాఁడనియు, గొప్ప విద్వాంసుఁడనియు అందఱును పొగడుచుండఁగా, మీరు వానిని అవమానించుచున్నారఁట! వానికి ఏమియు రాదనియు, చాలకాల మింకను విద్య నేర్చుకొనవలసియున్నదనియు, వాఁడు పొగడ్తకుఁ దగఁడనియు మీ రందఱితోను చెప్పుచున్నారఁట! ఇది వాని మనస్సునకు చాల కష్టముగా ఉన్నది" అని పలికెను. ఆ మాటల కాతఁడు నిర్ఘాంతపడి, తన యభిప్రాయమును భారవి తెలిసికొనఁజాలనందులకు మిగుల విచారించి, "పిచ్చిదానా! అబ్బాయిపయి నా కామాత్రపుటభిమానమును, వాని పాండిత్యము నెడసంతృప్తియును లేవనుకొనుచున్నావా? అబ్బాయి గొప్ప విద్వాంసుఁడని నే నెఱుఁగుదును. కాని యితరులు "మీ అబ్బాయి గొప్ప పండితుఁడండీ" అని నాతోఁ బలుకునపుడు "చిత్తమండి! ఔనండి!" అనుచు పండ్లిగిలించుకొనవలెననియా మీ భావము? బిడ్డల శ్రేయముఁ గోరు తలిదండ్రులు వారి నెంతమాత్రము కొనియాడరాదు. ఇతరులు కొనియాడినను—ఆ పొగడ్తను సహింపరాదు. తన్ను స్తుతించుకొనుట యెట్లో తన బిడ్డలను స్తుతించుటయు నట్లే యని యెంచవలెను.

నేనును అట్టి పద్ధతినే యనుసరించితిని. దీనినిబట్టియే నా భారవి మనస్సును కలఁతపఱచుకొనుట ?" అని పలికెను. ఇంతవఱకును తలిదండ్రుల సంభాషణమును వినుచున్న భారవి తండ్రికిఁ దన యెడఁగల గౌరవ-వాత్సల్యములను, తనశ్రేయోభిలాషితను గుర్తెఱింగెను. అట్టి తండ్రియెడఁ దాను తలపెట్టిన ఘోరమును దలఁచుకొనినచో నాతనికి గుండెలు బ్రద్దలయ్యెను. అతఁడు తోడనే తనచేతిలోని ఱాతితోఁగూడ అటుకనుండి క్రిందికి దిగి, తండ్రికి సాష్టాంగనమస్కారము చేసి, అతనియెడఁ దనకుఁ గలిగిన దురభిప్రాయమును, తాను తలంచిన ఘోరకృత్యమును తెలిపి, తన పాపమునకుఁ దగిన శిక్షను విధించవలెనని కోరెను. తండ్రి యాతని యథార్థవాదిత్వమునకును, నిష్కల్మషహృదయమున కును మిగుల సంతసించి "నాయనా! నీ హృదయము నెఱిఁగితిని. నీవు తలఁచిన పనికిఁ బశ్చాత్తాపమే ప్రాయశ్చిత్తము. పశ్చాత్తప్తునకు వేఱుగు శిక్ష అనావశ్యకము. నా అభిప్రాయము నెఱిఁగితివి కాన ఇఁక నీ మనస్సులో ఎట్టి కలఁతయు నుండదని తలంతును. నీపయి నా కెట్టి కోపమును లేదు. నిర్విచారముగ నుండుము" అని పలికెను.

భారవి కా వచనములు తృప్తిని గొల్పకపోయెను. తాను తలంచిన కృత్యము మహాఘోర మనియు, దానికిఁ దగిన శిక్ష ననుభవించిననేగాని ప్రాయశ్చిత్తమైనటు లుండ దనియు నతఁడు తలఁచి, "నాయనగారూ! నా పాపమునకుఁ దగిన శిక్షను విధించిననేగాని నాకు సంతృప్తి కలుగదు. లేనిచో యావజ్జీవమును నన్నీ విషయము బాధించుచునే యుండును. దయయుంచి యర్హ్మదండనను విధింప వలెనని ప్రార్థించుచున్నాను" అని జనకుని వేఁడికొనెను. అందుల కాతఁ డాలోచించి "వత్సా! శిక్ష ననుభవింప నీవు కుతూహల పడుచున్నావు కాన తెలిపెదను. నీవు ఆఱునెలలపాటు అత్తవారి యింట ఉండుము. ఆ కాలమున నీవు నీ సొంతసొమ్మును వ్యయ

పఱుపరాదు. నీకుఁ గావలసినవాని కన్నింటికిని వారిపయినే ఆధార పడి యుండవలెను. ఇదియే నీ పాపమునకుఁ దగిన శిక్ష'' అని మెల్లగా పలికెను.

తండ్రి విధించిన శిక్ష భారవిని ఆశ్చర్యనిమగ్ననిగాఁ జేసెను. అత్తవారు మిక్కిలి గౌరవముతోఁ జూచుచుండఁగా విందు భోజనముల నారగించుచు, భార్య పరిచర్య చేయగా హాయిగాఁ గాలము గడపుట ఒక శిక్షయా? ఇట్టి శిక్ష ఆఱునెలలే కాదు, ఆ జేండ్లుకూడ అఱనిమునముపలె అనుభవించి రావచ్చును. తన యెడఁగల వాత్సల్యమున తండ్రి శిక్షకు బదులు ఈరీతిని తెలిపెనని తలఁచి యిది శిక్షగాఁ దోఁచలేదనియు, తగినశిక్షను విధింపవలె ననియు అతఁడు తండ్రిని కోరెను. తండ్రి 'అంతకంటె కఠినమగు శిక్ష మఱిలే'దని జబాబుచెప్పెను. చేయునది లేక భారవి మఱు నాఁడే అత్తవారింటికిఁ బ్రయాణ మయ్యెను

మహాపండితుఁడగు జామాత ప్రత్యేకపుఁబిలుపులు అక్కఱ లేకయే అనుకొనకుండఁగ వచ్చుటచే భారవియత్తవారింట అందఱికిని అత్యంతమగు సంతోషము కలిగెను. వా రాతని యడుగులకు మడుగు లొత్తుచు విశేషముగ గౌరవించిరి. అతఁడు వచ్చినందుల కాతని భార్యయు ఆనందమున ఆకసము నందుకొనెను. భారవి ఆ యింట స్వర్గసుఖముల ననుభవించుచు తండ్రి విధించిన యిట్టి శిక్షను విమర్శించుచు లోలోపల నవ్వుకొనుచుండెను.

అయిదాఱుదినము లిట్లు జరిగెను. ఆ పిదప అల్లునికి గౌరవము క్రమక్రమముగ తగ్గుచువచ్చుచుండెను. పదునైదు దినము లగు సరికి బొత్తిగా మర్యాద తగ్గిపోయెను. మఱి పది రోజు లగుసరికి కాకిపైని, పిల్లిపైని, ఎలుకపైని పెట్టి పనిపాటులు లేక ఇంటఁ గూరు చుండి తేరఁగ తినువారి నెవ్వరు భరింపఁగల రను అభిప్రాయముచు

అత్తవారు వెల్లడింపసాగిరి. అప్పటికిని అల్లుఁడుగారు కదలునట్లు కన్పడనందున మోమోటమి విడిచి పిల్లలకుఁ జదువుచెప్పుట, చంటి పిల్లలను ఎత్తుకొని సముదాయించుట, ఆ పిదప వారి సంరక్షణ భారము వహించుట మున్నగు కార్యముల కాతనిని నియోగించిరి. తండ్రికి ఇచ్చిన మాట ననుసరించి భారవి తన భార్యతోఁగాని, అత్తవారితోఁగాని తన వృత్తాంతమును చెప్పకుండెను. కడపటి కాతఁడు పొలముపనులను చూచుటకు నియోగింపఁబడెను. భారవి వేఁకువజామున కోడికూయకమునుపే నిదురలేచి, పశువులను దోలుకొని పొలమునకుఁ బోవును. కాల్యకృత్యముల నచటనే తీర్చుకొనును. రెండు జాములు తిరుగుసరికి అతని భార్యయే అన్నమును తెచ్చిపెట్టఁగా తిని, కొంచెముసేపు మాత్రము విశ్రాంతి తీసికొని, మరల వ్యవసాయపుఁబనులలో నిమగ్నుఁ డగుచుండును. చీఁకటి పడువఱకును అట్లు పనిచేసి యింటికి వచ్చును. పిదప స్నాన, భోజనములను నిర్వర్తించుకొని విశ్రమించును. ఇది యాతని దినకృత్యము. ఇట్లతఁడు కొన్ని నెలలు గడపెను. ఇంత కష్టపడి పనిచేయుచున్నను అత్తవారికిఁ దనయెడల నించుకయినను విశ్వాసము లేదు. వా రాతనికి ఊరకయే తిండిపెట్టుచున్నట్లు భావించి, మనస్సును నొప్పించుచు మాటలాడుచుండిరి. భారవి వీని నన్నింటిని సహించి, తన తండ్రిని మించిన మేధావి లేఁ డనియు, అతఁడు తనకుఁ దగిన శిక్షనే విధించెననియుఁ దలఁచి దిన మొక యుగముగ - శాంతముగనే కాలమును గడపుచుండెను. భర్తను పరోక్షమునందు తన పుట్టినింటివా రాడు మాటలు చెవులకు ములుకులై సోఁకుటచే భారవిభార్య వానిని సహింపఁజాలకుండెను. కాని ఆమె యేమి చేయఁగలదు? ఇట్టిచోట నుండుట యేల? అనియు, ఇంత కలిగియున్నవారముగాన, ఇంటికిఁ బోవుటయే మే లనియు ఆమె ఎంత బోధించినను భారవి శాంతముగఁ గొంచెము కాలము

తాళవలెనని ఆమెను సమాధానపఱచుచుండెడివాఁడు. ఇట్లు ముండ్లమీఁదవలె, ఆ దంపతు లా యింట నిలిచి, కాలమును గడపుచుండిరి.

నాఁడు శ్రావణ గురువారము. నాఁటితో భారవికి అత్త వారింట ఆఱు నెలలును పూర్తియైనవి. మఱునాఁడు శ్రావణ శుక్రవారము; వరలక్ష్మీవ్రతదినము. అది ముత్తయిదువలకు కొంగుబంగారము. భారవియత్తవారింట అందులకుఁ దగిన ప్రయత్నములు జరుగుచున్నవి. యువతులకు వెలలేని చీరలు, సువర్ణాభరణములు సిద్ధపఱుపఁబడినవి. కాని, పాపము! భారవి భార్యకు ఒక రవికగుడ్డ అయినను కొనఁబడలేదు. అత్తవారికి భారవి యెడఁగల అనాదరమే దానికిఁ గారణము. ఆనాఁ డామె ఆ యవమానమును సహింపలేకపోయెను. ఆ యింట నొక క్షణమయినను ఉండఁజాలనని యామె యాతనితోఁ బలికెను. ఆతఁడు "ఈ దినముతో నావ్రతము పూర్తికాఁగలదు. కాన ఓపికపట్టుము. తెల్లవారు సరికి మన మీ యిల్లు విడువవచ్చును. నీ వ్రతమును మహా వైభవముగ జరుపవచ్చును" అని పలికి, యొక తాఁటియాకుపయి ఒక శ్లోకమును వ్రాసి, యామెచేతి కిచ్చి, దానిని ఆ యూరిలోని ధనికుఁడగు గుణనిధియొద్దకుఁ బంపవలె ననియు, మహాకవి భారవి యీ పద్యమును కుదువపెట్టుచున్నాఁ డనియు, వేయి వరహాల నిచ్చినచో, మఱల బదులు తీర్చి, యీ పద్యమును విడిపించుకొను ననియు చెప్పి, ఎవరి మూలముగ నయినను పంపవలె నని కోరెను. ఆమెయు భర్త చెప్పినట్లే చేయఁగా, ఆ వర్తకుఁడు మాఱుమాట పలుకక, భారవి కోరిన నైకమును పంపెను. భారవిభార్య దానికి మిగుల సంతసించెను. ఆమె భర్తతో ఆలోచించి, ఒక పెద్ద మేడను వారము దినములకు అద్దెకుఁ దీసికొని, కావలసిన ఉపకరణ ములను, వ్రతమున కావశ్యకములగు వస్తువులను సేకరించి, యా

భవనమున సిద్ధపఱచి యుంచెను. మఱునాఁటి ప్రాతఃకాలమున ఆమె పుట్టినింటిని విడిచిపోవుచుండునప్పటివఱకును ఆ వృత్తాంతము ఇంటిలోనివారి కెవ్వరికిని తెలియనే తెలియదు. ఆమె విలువైన నగలను, దుస్తులను ధరించి వచ్చి, పుట్టినింటివారిని పేరంటమునకుఁ బిలువఁగా వారందఱును ఆశ్చర్యముతో ముక్కుమీఁద వ్రేలువేసికొనిరి. క్రమముగా వారికి భారవి సరిగా ఆఱునెలలపాటత్తవారి యింట కాలము గడపుటకుఁ గల కారణము తెలిసెను. అది తెలిసికొని వారు ఆతనియెడఁ జూపఁబడిన తమ ప్రవర్తనమునకు మిగుల లజ్జించిరి.

కొలఁదిదినములలో భారవికవి తన భార్యతోఁగూడ స్వనగరమునకుఁ బోయెను. తండ్రి తనకుఁ దగిన శిక్షనే విధించెనని ఆతని బుద్ధిచాతుర్యమును కొనియాడెను. భారవి క్రమముగ పేరు ప్రతిష్ఠలు సంపాదించి, రాజానుగ్రహమును గాంచి, విశేష ధనము నార్జించి, సుఖముగఁ గాలమును గడపుచుండెను. కొంత కాలమువఱకును తాను గుణనిధియొద్ద కుదువపెట్టిన పద్యపత్రిక మాట మఱచియేపోయెను. ఒకనాఁడు భార్యతోఁ బ్రసంగించుచు సందర్భవశమున ఆ పద్యవృత్తాంతమును తలఁచి, ఒక నమ్మకమయిన సేవకునిచేతికి వేయి వరహాల నిచ్చి, గుణనిధివద్దకుఁ బంపుచు, ఆ సొమ్మును చెల్లించి, పద్యమును దీసికొనిరావలె నని ఆజ్ఞాపించెను. అతఁడును భారవియత్తవారియూరు చేరి, గుణనిధిని దర్శించి, తన రాకకుఁ గల కారణమును తెలిపెను. గుణనిధి యా ధనమును తీసికొనక, పద్యపత్రికనుమాత్ర మాతనిచేతి కిచ్చుచు, ధనముతోఁ గూడ ఆ పద్యమును భారవి కర్పింపవలె ననియు, వారముదినములలో గుణనిధివచ్చి మాటలాడఁగలఁడని చెప్పవలె ననియు ఆ వచ్చినవానిని ప్రార్థించెను.

మహాకవి 'గుణనిధియొద్ద ఆ పద్యమును తాకట్టుపెట్టి పది యేండ్లయినది. ఆ వెంటనే యాతఁడు వాణిజ్యము చేయుటకయి విదేశములకుఁ బోయి, కొలఁదిదినముల క్రిందటనే ఇట్లు చేరుకొనెను. తాను తనయూరు విడుచుసరికి ఇంటఁ దన ముదుసలి తల్లియు, భార్యయు, నాఁడేండ్ల పుత్త్రుఁడును తప్ప వే రెవ్వరున్న లేరు. అతఁడు తిరిగివచ్చునపుడు ముందుగా ఎవ్వరికిని తెలుపక ఒకనాఁటి నడురాత్రి ఒంటరిగ నింటికి వచ్చెను. తాను ఇంటలేని యా పదేండ్లలో తనభార్య ప్రవర్తన మెట్లుండెనో కనుగొనవలె నను తలంపుతో ఆతఁడు తన భవనపుఁబ్రహరిగోడ నెక్కి లోనికి దిగి, తిన్నగా పడుకటింటివైపు పోయి, కిటికీనుండి లోనికి తొంగి చూచెను. ఒక మంచముపయి భార్య పండుకొని గాఢనిద్రలో నుండెను. వే ఱొక మంచముపయి ఒక యువకుఁడు పరుండి యుండెను. గుణనిధికి భార్య చెడునడతకల దని తెలిసిపోయెను. అట్టి కళంకినివలనఁ దనకును, తన వంశమునకును అపకీర్తి కలుగుచున్నందున ఆమెను చంపివేయవలెనను ఉద్రేకము కలిగెను. ఆతఁడు తన మొలను దోఁపుకొనిన బాకును బయటికిఁ దీసెను. అట్లు తీయుచున్నప్పుడు ఆ తొందరలో అతని యంగీజేబునుండి ఒక పత్త్రము జాఱి క్రిందపడెను. అది భారవి యాతనియొద్ద తాకట్టుపెట్టిన పద్యపత్త్రిక. భారవియెడఁ దనకుఁగల గౌరవమును బట్టి గుణనిధి ఆ పత్త్రమును తనయొద్దనే యుంచుకొనెను. అతఁడా పత్త్రమును తీసి, అందలి వ్రాఁత నొకటి, రెండు పర్యాయములు చదువుకొనెను. ఆ పద్యభావ మిది:—

"తొందరపాటున ఎట్టి పనిని చేయరాదు. తెలివిలేమిచే తొందరపడుటయే ఆపద లన్నింటికిని కారణము. బాగుగ విమర్శించి పనుల నొనర్చువానికి అన్ని కార్యములును సానుకూలముగ నెఱవేఱును; సంపదలు కలుగును."

భారవి తండ్రియెడ ద్రోహము తలపెట్టి, పశ్చాత్తప్తుఁడైన పిదప వ్రాసిన పద్య మిది ; అనుభవపూర్వకమైనది. గుణనిధి యీ పద్యమునర్థమును బాగుగ గ్రహించి, భార్యను చంపుటకుఁ దొందరపడక—పడుకటింటితలుపును కొట్టి భార్యను పిలిచెను. భర్త గొంతుక విని, ఆమె కంగారుపడి లేచి వచ్చుచు, పెక్కేండ్లకు మఱల ఆతని దర్శనభాగ్య మబ్బినందులకు మిక్కిలి యానందించుచు, నాతని పాదములకు నమస్కరించి లేచి, పరుగున లోనికిఁ బోయి, పరుండియున్న యువకుని లేపి, చెయ్యిపట్టుకొని తీసికొని వచ్చి, "అరుగో! మీనాయన వచ్చినారు ; వారి పాదములకు దండము పెట్టుము" అని పలికెను. ఈ మాటలకు గుణనిధి నిర్ఘాంతపడిపోయెను. ఆ యువకుఁడు తన పుత్త్రుఁడే యని తెలిసికొని యాశ్చర్యపడెను. తా నిల్లు విడుచునరికి తన పుత్త్రున కాఱేండ్ల వయస్సనియు, ఇప్పు డాతనికి బదునాఱేండ్లు నిండియుండు ననియు జ్ఞప్తికి వచ్చి, తాను భార్యయెడఁ దలఁచిన మహాపాతకమునకు లోలోన లజ్జించుచు, తన యానందమును వెడలఁగ్రక్కెను. భారవిపద్యము తన యుద్రేకము నడంచి, తన భార్యజీవములఁ గాపాడి,తన్మూలమున వంశమును నిలిపె ననియు, తన్ను ఘోరనరకమునుండి తప్పించె ననియు ఆతని మహోపకారమునకు మిగుల నంతసించెను. అందువలననే భారవి పంపిన ధనమును గ్రహింపలేదు. అంతేకాక అతఁడు తా నా వార్తాహారునితోఁ జెప్పిన ప్రకారము భారవిమహాకవిని దర్శించి, అతని పద్యము తన కొనరించిన మహోపకారములను వివరించి తెలిపి, అతని ఋణము చెల్లె నను

టయేగాక పదివేల వరహాలను పారితోషికముగా నర్పించెను. తాను యావజ్జీవము భారవికి, అతఁ డొనరించిన మహోపకారము నకు ఋణపడియే యుందు ననియు, మహాకవి చేసిన యప్పును ఆతఁడు అవలీల తీర్పఁగలిగెను గాని, మహాధనికుఁడగు తాను ఎన్ని జన్మము లెత్తినను కవిఋణమును తీర్పఁజాల ననియు వేనోళ్ల భారవిని కొనియాడెను.

తొందరపాటు ఎంతమాత్రమును తగదు; నిదానించి చేసిన పనుల కెన్నఁడును హాని కలుగదు.

---